ఇది ఈ తరం కథ!
నేటి యువతరం కథ!
నేడే చూడండి!





ఎమ్.బాలయ్య B.E., సమర్పించు-
అమృతా ఫిలింస్......

# నేరము శిక్ష

దర్శకత్వం: కె. విశ్వనాథ్ B.Sc.,

నిర్మాతలు: అలపర్తి సూర్యనారాయణ, మన్నవ వెంకట్రావు.

కథ: బాలయ్య B.E., సంగీతం: ఎస్. రాజేశ్వరరావు. శ్రీ ఫిలింస్

Veekay

# ఉత్తరాలు

## వాణిశ్రీ విజ్ఞప్తి

నన్ను నటిగా అభిమానించి ఆదరిస్తున్న నా 'నట' జీవితానికి రాచబాటలు తీర్చిన మహానుభావులు ఎందరో ఉన్నారు. నేను సినిమాలలో ప్రవేశించాలనే ఆశయంతో మద్రాసు వచ్చిన రోజులవి. నటిగా రాణించాలంటే నాట్యంకూడా విధిగా నేర్చుకుని తీరవలసిన రోజులవి. అప్పుడు శ్రీ వెంపటి చిన సత్యం గారి వద్ద నాట్యం నేర్చుకునే సదవకాశం నాకు లభించింది.

ఆ తర్వాత కొంత కాలానికి శ్రీ వెంపటి చిన సత్యం గారు మద్రాసులో 'కూచిపూడి ఆర్ట్స్ అకాడమీ'ని నెలకొల్పారు.

ఆంధ్రులకు గర్వకారణమైన కూచిపూడినాట్య కళను పరిరక్షించి, పోషించి, ప్రపంచ నలుమూలలకు బహుళ వ్యాప్తంచేయాలనే ఆశయంతో యీ 'అకాడమీని', నడుపు తున్నామని, శాంతి నికేతనంవలే, గురుకుల పద్ధతిలో యీ నాట్యవిద్యా వ్యాప్తి చేయదలచామని, దానికిగాను స్వంతస్థలం అనుకూల భవనాలు మొదలైనవి సమకూర్చుకొనేందుకు ధనం కావాలని, ఆ ద్రవ్యసేకరణకు, హైదరాబాదులోను, విజయవాడలోను, రెండు నాట్య ప్రదర్శనలు యివ్వమని తన శిష్యురాలిగా నన్ను అడుగుతున్నానని, గురువుగారడిగినప్పుడు నేను చాలా ఆనందించాను. మాష్టరుగారి ఋణం యీవిధంగా తీర్చుకోగలనని కాదు, వారి వద్ద నేర్చుకొన్న విద్య, వారి విద్యాలయాభివృద్ధికి, ఉపకరిస్తుందన్న సంతోషంలో నా శ్రేయోభిలాషుల అభిమానుల సహకారంకూడా లభిస్తుందన్న ఆశతో అంగీకరించాను. నావలె శ్రీ చిన సత్యం గారి వద్ద 'అకాడమీలో' నాట్యం నేర్చుకొని, తారా పథంలోకి వచ్చిన సోదరీ మణులు కూడా యీవిధంగా సహకరిస్తే బాగుంటుందని నా అభిప్రాయం.

ప్రదర్శనల ద్వారా 'కూచిపూడి ఆర్ట్స్ అకాడమీకి' మనదైన కూచిపూడి నాట్య కళాభివృద్ధికి, పోషణకు మీరంతా యథోచితంగా సహాయపడాలని నా విన్నపం.

మీ
వాణిశ్రీ

### కథలు

20—7—73 సంచికలో ముగిసిన 'తెరచి మూసిన తలుపులు' పెద్దకథ బాగానే వుంది. కాని మగవాళ్ళను అంతగా ఎత్తి వేయడము, సమంజసముకాదు. ఐన యీకథ ఆడవాళ్లను బాగా ఆకర్షించి వుంటుందని నా ఊహ..

చంద్రశజంత్‌కర్, (గుంటకల్)

* * *

జితేంద్ర ముఖ చిత్రంతో వెలువడిన సంచిక అమితాకర్షణీయంగా ఉంది. ముఖ్యంగా 'ద్విభాష్యం' కథ చాలా బావుంది. "మనుషులు మారలేదు" అని రచయిత మ. వె. కృష్ణమూర్తిగారు చక్కగా నిరూపించారు. విజ్ఞానయుతమైనవిగా ఉన్నాయి డాక్టర్ సలహాలు!

తాతిరాజు జగన్ (బరంపురం)

* *

మీ (మా) అభిమాన పత్రిక ముఖ చిత్రంకాంచన చూడ ముచ్చటగా వుంది. ఈ సంచికలో ముగిసిన ఎస్. ఎస్. ప్రసూనగారి పెద్దకథ చాలా బాగుంది, గాని "జగన్" లెటర్ వ్రాయకుండావుంటే ఇంకా బాగుండేది.

యస్. జయలక్ష్మి, (పాతపట్నం)

### ముఖచిత్రం

సినీతార 'కాంచన' ముఖ చిత్రంతో వెలువడిన ఈ వారం (20—7—73) పత్రిక నన్ను కొంచెం నిరుత్సాహ పరచిందనే చెప్పాలి. కథల్లో 'సంధి సమయం', 'డబ్బు చుట్టూ లోకం తిరుగుతోంది' అన్నవి ఒక మోస్తరుగా ఉన్నాయి.

జ్యోతి (భిలాయి)

* * *

27—7—73 జితేంద్ర ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఆకర్షణీయంగా ఉంది.

పావులూరి మురళి (అద్దంకి)

* * *

క్రొత్త పెళ్ళికూతురిలా, అలంకరించుకొని వచ్చిన 27—7—73 వ నాటి 'జితేంద్ర' ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చూడ ముచ్చటగా వుంది.

పి. పాండయ్య (హైదరాబాదు)

* * *

27—7—73 వ నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక అట్టమీది బొమ్మ హిందీ నటుడు 'జితేంద్ర' ముఖచిత్రం చాలా ఆకర్షణీయంగా యున్నది. మాకు చాలా ఆనందాన్ని కలిగించింది

పి. హెచ్. పాండు (నలిగొండ)

### సినిమా

20—7—73 సినిమా శీర్షికలో శ్రీనివాస్ గారు వ్రాసినట్లు 'పుట్టినిల్లు— మెట్టినిల్లు' చిత్రంలో హీరో కృష్ణగారు తన పాత్రను చక్కగా పోషించారు. ఈ చిత్రం హీరో కృష్ణని చలనచిత్ర జీవితంలో పద్మశ్రీల స్థాయిని చేర్చినది.

జె.లలితారెడ్డి, రామనమ్మ, జయమ్మ, రేణుక
(విజయవాడ—2)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938– 1972)

శుక్రవారం : 10-8-73
శ్రీ ప్రమాదినామ సం॥ శ్రావణమాసం శు. ద్వాదశి
సంపుటము : 66 సంచిక : 47
స్థాపితం 1908

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1
విడి ప్రతి వెల 50 పైసలు


## విషయానుక్రమణిక






బి. అచ్యుతరామరాజు సమర్పించు
శ్రీవాణీ కంబైన్స్
స్నేహబంధం

కథ. నిర్మాత
ఎస్. వి. సుబ్బరాజు.
స్క్రీన్‌ప్లే. దర్శకత్వం
పి. చంద్రశేఖరరెడ్డి B.A

అన్నపూర్ణా ఫిలింస్ రిలీజ్



# హైదరాబాద్ నోట్‌బుక్

### తిరుమల రామచంద్ర

## రాకెట్లతో ధరల పోటీ

ఇది రాకెట్ యుగం కావడంవల్లనే కాబోలు ధరలు మరీ యిదైపోయి, జనాన్ని పెద్ద పులులవలె తరుముతున్నాయి. బియ్యం, అపరాలు, వంట నూనెలు, నెయ్యి హైజంపువాళ్ళు లాంగ్‌జంపువాళ్ళు కొత్త రికార్డులు స్థాపించినట్లు కొత్త ఎత్తులను అందుకొంటున్నాయి. పాటక జనం సంగతి అటుంచి మధ్యతరగతివాడికి ధరలు తలచుకొంటేనే గాభరాగా ఉంది. గృహిణులకు మరొక సమస్య ఎదురయింది. అంట్లు తోమే నౌకరు మొదలు—అందరూ ఎక్కువ జీతనాతాలు అడుగుతున్నారు. మామూలు బియ్యం కిలో రెండు రూపాయలు దాటింది. వేరుసెనగనూనె కిలో 9, 10 రూపాయలని విని 'ఇక తిరుగమోతకూడ మానుకుందామండీ' అన్నది నా మిత్రుని భార్య, మిత్రునితో బహిరంగంగానే. అందరికన్నా బాధపడుతున్నవారు ఏ డబ్బా పాలకో అలవాటుపడిన పసిపిల్లలు. పాలపొడి చీకటి బజారు ధర రెండింతలు కావడంతో తల్లులకు ఏమి తోచడంలేదు; మరొక వస్తువు వాడదామంటే విరేచనాలు. 'ఇదేమి రాజ్యం బాబూ పాలపొడి కూడా దొరకని రాజ్యం!' అన్నది శ్రీమతి శారదమ్మ అనే ఇల్లాలు. 'వర్తమాన పౌరుల పరిస్థితే వర్తనంగా ఉండగా, భావిపౌరుల విషయం పట్టించుకునేవాడెవడే!' అన్నాడు ఆమె భర్త.

## దొంగ నాణేల నిర్మాతలు

మనం ఎంత జాగ్రత్తగా వున్నా, జేబులు కొట్టేవారు మనకన్నా జాగ్రతగా పొంచి వుంటారు— అన్నాడు ఒక అధికారి నాతో. 'మనం లెక్కేముంది సార్. ప్రభుత్వం ఎంత జాగ్రతగా వున్నా అంతకన్నా జాగ్రతగా దొంగనోట్ల నిర్మాతలు కార్యకలాపాలు సాగించడంలేదా?' అన్నాను... కాని, జంటనగరాల పోలీసు అధికారులు మహా జాగరూకులు గనుక ఈ రూకలు తయారుచేసేవారిని పట్టుకుంటూ, ప్రజలకు సేవ చేస్తూనే వున్నారు. జులై రెండవ వారంలో పురానపుల్ వద్ద అర్ధరూపాయ దొంగనాణేలను మార్చడానికి ప్రయత్నించిన ఒక వ్యక్తిని సర్కిల్ ఇన్‌స్పెక్టర్ శ్రీ డి. నాగేశ్వరరావు అరెస్టు చేయడంతో ఒక ముఠా ముఠాయే బైట పడింది. నేరశాఖ అసిస్టెంటు కమిషనర్ శ్రీ బి. వి. మల్లారెడ్డి నాయకత్వాన దర్యాప్తు జరుగుతున్నది.

## తెలుగునుంచి సంస్కృతానికి

తెలుగువారి ప్రతిభ ఇతరులకు తెలియకపోవడానికి కారణం హిందీ, ఆంగ్లాలలో తెలుగువారు హెచ్చుగా రచనలు సాగించకపోవడం. సంస్కృతంలో రచిస్తే దేశంలోని విద్వాంసులకు మన ప్రతిభ తెలుస్తుంది: ఈ దృష్టితో శ్రీ కాళూరి హనుమంతరావు తమ తెలుగు వ్యాస సంకలనం 'సాహితీ జగతిని' తామే సంస్కృతీకరించడం, శ్రీ కె. రాజన్నశాస్త్రి తెలుగువారి భావనా వైభవం తెలుపుతూ 'సుమాంజలి' కవితా సంకలనం రచించడం, వీటిని సురభారతీ సమితి జులై రెండవ వారం హిందీ ఆర్ట్స్ కళాశాలలో ఆవిష్కరించడం ఎంతో ముచ్చటగా వుంది. ఈ పుస్తకాలను ఆవిష్కరించిన విద్వాంసులు శ్రీ ఎం. గోపాలరెడ్డి, శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి సంస్కృతాధ్యయ నావశ్యకత వివరించారు. నిజానికి సంస్కృతం నేడు, విద్యారంగంలో వున్నవారికన్నా ఇతరులవల్లనే వ్యాప్తి చెందుతున్నదనవచ్చు. శ్రీ కాళూరు హనుమంతరావు అధ్యయనం చేసింది విజ్ఞానశాస్త్రం. అధ్యాపకవృత్తి టెక్నాలజీ కళాశాలలో ఆచార్యులు. కాని, పండిత వంశంవారు గనుక సంస్కృతాన్ని అభిమానించి అధ్యయన రచనలు సాగిస్తున్నారు. శ్రీ రాజన్నశాస్త్రిగారు, పండిత ప్రకాండులకు ఆదిపట్టయిన ధర్మపురివారు. వారి అన్యాపదేశ కవిత ప్రాచీనులైన కుట్టి కవి, జగన్నాథ పండిత రాయల కవితలను తలపిస్తున్నది.



ఇటీవల హైద్రాబాద్ రవీంద్రభారతిలో "నవోదయా ఆర్ట్స్" ప్రదర్శించిన "వెంటాడే నీడలు" నాటక ప్రదర్శనానంతరం, రచయిత పి. వి. రమణని అభినందిస్తున్న పద్మశ్రీ, నటరత్న, యన్. టి. రామారావు. శ్రీయుతులు మాకల నరోత్తమరెడ్డి ( వైస్‌ఛాన్స్‌లర్, ఉస్మానియా యూనివర్శిటీ) వి. మధుసూధనరావు ( హైకోర్టు జడ్జి )డా. దివాకర్ల వెంకటావధాని, పి. వి. రంగారావుగార్లని కూడా చిత్రంలో చూడవచ్చు.

## మళ్ళీ ఎప్పుడు ?

రాష్ట్రపతి పాలన గడువు ముగియనుండగా మరొకమారు శ్రీ బ్రహ్మానంద రెడ్డి స్థానిక నాయకులతో మంతనాలు జరుపడంతో చాల విషయాలు స్పష్టమయ్యాయి. దేశ పరిస్థితులనుబట్టి రాష్ట్ర విభజన ఇప్పట్లో జరుగుతుందనే ఆశ అడియాస అయినట్టు కొన్ని వర్గాలవారు అంటున్నారు. విభజన వాదుల మాటలలో, నినాదాలలో, ప్రసంగాలలో కలిగినమార్పును బట్టి ఈ అనుమానాలు బయలుదేరాయి. 'విభజనే ఏకైక మార్గం. కాని, కేంద్రం మరొక పరిష్కారం అమలుపరిస్తే ఎక్కువ రోజులు వుండదు' అన్నారు ఒక విభజన నాయకుడు. 'ప్రతిఘటిస్తాము, పోరాడుతాము' అనే మాటలు మాయమయ్యాయి. మరొక విభజన వర్గం 'బేషరతుగా సమైక్యం' అనడం మాని, రక్షణలు లేని సమైక్యరాష్ట్రం' అంటున్నది. 'ప్రజల ఇష్టం విభజన, ప్రజలకు బాధ్యులుగా విభజన కోరము. ప్రధాని కాదంటే, క్రమశిక్షణయుత సైనికులం కదా మేము' అంటున్నది మరొక వర్గం. 'అన్యా కావాలి, బుర్యా కావాలి.' దీనివల్ల శ్రీ బ్రహ్మానంద రెడ్డి ఈసారి చెప్పుకోదగిన విజయం సాధించారనే చాలామంది భావం.

## శ్రీ వైకుంఠం చిత్రాలు

జూలై మొదటివారం కళాభవన్‌లో ఇరాన్ కాన్సుల్ జనరల్ శ్రీ పర్విజ్ ఖజాయి ప్రారంభోత్సవం జరిపిన శ్రీ టి. వైకుంఠం చిత్రాల ప్రదర్శనం ఆయన ప్రయోగాత్మక దృష్టిని చాటింది. ఈ ప్రదర్శనంలోని 17 చిత్రాలూ ఏవో సమస్యలను మన ఎదుట పెడుతాయి. శ్రీ వైకుంఠం 1970 లలితకళ పట్టం పుచ్చుకొన్న తర్వాత బరోడలో వున్న శ్రీ కె. జి. సుబ్రమణియన్‌తో ప్రభావితుడయ్యాడు. విద్యార్థి దశలో ఈయన యి విసురు, త్వర వర్ణనాతీతమని సహచరులంటారు. కాని, శ్రీ వైకుంఠం నేడు నెమ్మదిగా ఆలోచనతో చిత్రాలు గీస్తారు. ఇంతకూ తొందరేముంది? ఈయన చిత్రాలు ఆశ్చర్యం కొలుపవు భయాం గలిగించవు. నిత్యసత్య సౌందర్య సమస్యను పరిష్కరిస్తున్నట్లు, పరిష్కారానికి మన

మంచి ఆలోచనలు కొరియుతున్నట్టు ఉంటాయి. స్లో అండ్ స్టడీ విన్స్ ది రేస్ — అన్నారుకదా పెద్దలు.

## గంగా కావేరి లంక

విన్నో దశాబ్దాలుగా చర్చితమౌతున్న గంగా కావేరి లంకె పథకానికి జులై 18వ

# ప్రాచీన వైద్య పద్ధతులు

## వ్రణము, లసు, పుళ్లను హరించేవి

1. ఉమ్మెత్తకాయను కుమ్ములో ఉడికించి — మెత్తని ముద్దగా నూరి వ్రణముపై పెట్టి కట్టుకడితే అన్నిరకాల వ్రణాలు తగ్గుతాయి. నల్లఉమ్మెత్తకాయ శ్రేష్ఠమైనది.

2. కుక్కవాయింటఆకు మెత్తని ముద్దగా నూరి పైనవేసి కట్టుకడితే వ్రణములు మానుతాయి. దీనికి సంస్కృతంలో పూతిబర్బరా, బస్తగంధ అని అంటారు.

3. ఆరోగ్యవంతమయిన అశ్వమూత్రాన్ని పూటకొక అవున్సు చొప్పున రోజూ ఉదయం, సాయంత్రం కొన్నాళ్ళు పానం చేయిస్తే అస్థిగత వ్రణాలు హరించబడతాయి.

4. ఉత్తరేణి చెట్టు సమూలభస్మంలో తగుమాత్రం హరిదళం వేసి— నూనెతో మెత్తగానూరి—ఆ పలస్త్రీని పూస్తూ వుంటే పుళ్ళు, ఉలిపిరికాయలు హరిస్తాయి.

5. ఊరబంది క్రొవ్వులో ఆగాకరదుంప చూర్ణాన్ని కలిపి — పలస్త్రీచేసి— దానిని పుళ్ళపై పట్టిస్తూ వుంటే, అవి త్వరలో మానతాయి.

6. కత్తిమందు చెట్టుపాలను పైనకొన్నాళ్ళు పూయుటవలన పుళ్ళు, వ్రణాలు హరిస్తాయి.

7. కానుగచెట్టు ఆకులను ముద్దగానూరి — ఆముద్దను వ్రణాలకు పట్టించి కట్టు కడుతూవుంటే పురుగులు పడిన వ్రణాలు మానతాయి. ఒక ఔన్సు కానుగచెట్టు ఆకుల రసంలో ఒక ఔన్సు మంచినూనె కలిపి అందులో మూడు గోధుమగింజల ఎత్తు మయిల తుత్తము కలిపి పూస్తుంటే — స్ఫోటలు, పుట్టవ్రణాలు మానతాయి. కానుగనూనె కూడా పనిచేస్తుంది. కానుగచెట్టును సంస్కృతంలో కరంజక, చిరబిల్వ అని అంటారు.

8. కుసుంబాచెట్టు (కుసుమ చెట్టు) విత్తుల నుండి తీసిన తైలాన్ని పైనపూస్తూ వుంటే దుష్టవ్రణాలు మానతాయి. ఈ చెట్టును సంస్కృతంలో గ్రామ్య కుంకుమ, వహ్నిశిఖ అని అంటారు.

9. గంగరావి చెట్టుయొక్క గాఢకషాయంతో వ్రణములను కడుగుతూ వుంటే అవి తగ్గుతాయి.

10. తిగెముషిణిచెట్టు ఆకుల కషాయంతో రోజూకడుగుతూవుంటే వ్రణాలు మానుతాయి.

11. తెల్లమద్దిఆకుల భస్మాన్ని మంచి నూనెలో కలిపి పైనపూస్తూ వుంటే మొండి వ్రణములు సహితం మానతాయి.

12. కారసాని వేమమును మెత్తగానూరి —పోటుగల వ్రణములపై పట్టువేస్తూ వుంటే వానిపోటు తగ్గి — తగ్గుతాయి.

13. పుగాకును చూర్ణంచేసి — ఆ చూర్ణాన్ని వ్రణములపై వేసి కట్టుకడుతూంటే అవి మానతాయి. ముఖ్యంగా మురికి వ్రణములు, చీముపట్టియున్న వ్రణములు మానతాయి. పుగాకు, పచ్చి శీతాఫలం ఆకు, హారతికర్పూరం కలిపి మెత్తగానూరి— ఆ ముద్దను వ్రణాలకు పట్టిస్తూంటే పురుగులు పట్టిన వ్రణములలోని పురుగులు చచ్చి —వ్రణములు మానతాయి. (ఇంకా వుంది)

సేకరణ : ఆకుండి నారాయణమూర్తి

ఒక విధంగా నాంది జరిగింది. భారత భూగర్భ పరిశోధన దక్షిణ ప్రాంతీయ కార్యాలయంలో నేషనల్ వాటర్ గ్రిడ్ (గంగా కావేరీ లింకె) సెల్ (తాత్కాలిక కార్యాలయం) నెలకొనడంతో, డిప్యూటీ డైరెక్టర్ జనరల్ శ్రీ పి. కరుణాకరన్ ప్రారంభోత్సవం చేశారు. అనుభవజ్ఞులైన భూగర్భ శాస్త్రజ్ఞులు శ్రీయుతులు బి. బి ఎస్. దత్, ఎం. ఎం. కృష్ణమూర్తి, టి. మధుసూదనరావులతో ఈ కార్యాలయం ఏర్పడింది. ఇది క్రమంగా విస్తరిస్తుంది. ఈ పథకం ప్రయోజనం

## హైదరాబాద్...

అనేక ముఖమువి చెప్పనక్కరలేదు. దీనికి 2900 కోట్ల రూపాయలు వ్యయమవుతుందట. ప్రస్తుతం ప్రాథమిక పరిశీలనకే 30కోట్లు అవుతుందట. దేశం ఎంత అందంగా, సమైక్యంతో ఎంత సుఖకరంగా అవుతుందో ఊహించుకుంటేనే ఒళ్ళు గగుర్పొడుస్తుంది నాకు.

**కుమారి పి. రాక్వెన్**

సుప్రసిద్ధ నాట్యాచార్యులు శ్రీ నటరాజ రామకృష్ణ శిష్యురాలు కుమారి పి. రాక్వెన్ జూలై 16న రవీంద్రభారతిలో ఆంధ్రదేశ ఆలయ నృత్యాలలోని ఆరాధన నృత్యాలు ప్రదర్శించి, ప్రేక్షకులను ప్రతిమాపాయులుగా చేసిందంటే అతిశయోక్తి కించిత్తమాత్రమూ లేదు. రాక్వెన్ అమెరికన్ యువతి. వయస్సు 20 సంవత్సరాలు. పుష్పాంజలి, గణపతి, దరువు, కైవార నృత్యం, అష్టదిక్పాల నర్తనం, గద్వాల దేవాలయంలోని పహరీ నృత్యం ముఖ్యంగా ఖండితనాయికాభినయం ప్రేక్షకులను ఆహా అనిపించాయి. మన సంప్రదాయమేమిటో తెలియని అమెరికను బాలిక ఏనిమిది నెలల క్రితమే మన దేశంలో అడుగు పెట్టిందా? అని ఎవరైనా ఆశ్చర్యపడతారు. ఈమె 1972 సెప్టెంబరులో బోయింగు విమానంలో భారతదేశంలో దిగింది. హైదరాబాద్ చేరి శ్రీ నటరాజ రామకృష్ణ నిర్వహించే 'నాట్య నికేతన్' నాట్య కళాశాలలో చేరింది. ఆయన తొలి పాశ్చాత్య శిష్యురాలు రాక్వెన్ అనుకుంటాను. ఆయన ఆలోచించి ఆంధ్రదేశానికి విశిష్టమూ, దేవాలయాగమ వ్యాఖ్యా సమ్మతమూ అయిన ఆరాధన నృత్యాలు నేర్పారు ఆమెకు. సంగీతనాటక అకాడమీ నిర్వహించిన ప్రత్యేక నృత్య శిక్షణాలయంలో శ్రీమతి ఉలి వెంకటరత్నం, నందె మాణిక్యం వంటి నాట్యకళా పారంగతుల వద్ద ఆంధ్రదేశ సంప్రదాయం పుణికి పుచ్చుకొన్నది. 'ఈ నృత్యాలమోజులో పడి అక్కడ న్యూయార్క్‌లో పిరిమ్యాజ్ విశ్వ విద్యాలయంలో చదువుతున్న చదువు మాను కొని వచ్చాను. ఇప్పుడు పోస్టల్ ట్యూషను ద్వారానైనా పూర్తి చేయాలి మరి' అన్నది రాక్వెన్.

**ఉపశృతి**

'అబ్బ! అసిస్టెంట్ వచ్చాక ఏం మరుకుతనం వచ్చిందయ్యా మీకంతా!' అన్నాను ఒక కండక్టరుతో. 'సార్, మీరు కూడ ఇప్పుడు కండక్టరును దేవుడు కుంటూ (వెతుక్కుంటూ) వస్తున్నారు గదా. మొదట్లోనైతే, చల్లగా జారుకొనేవారు గదా!' అన్నాడు కరుకుగా. 'బాగా దెబ్బ కొట్టావోయ్!' అన్నాను, ఏడవలేక నవ్వుతూ. ●










ఆర్థిక క్లిష్టపరిస్థితిని
అధిగమించడానికి
సలహాలని,
పథకాలని ఇచ్చి
ప్రభుత్వానికి
తోడ్పడటానికి
లోనికి రావలసింది
గా ప్రతిపక్షాలకి
ప్రధాని
ఆహ్వానం—






# ప్రశ్నోత్తరం

...కె. రామలక్ష్మి...

**ఎం. వి. ఎస్. ఆర్, ఏలూరు**

**విడుదుకంటే సమాన హక్కులు అంటూ గోల పెడతారు మీ ఆడవాళ్ళు. వంటింట్లో పడి వుండక. పూర్వకాలం స్త్రీలు వంటింట్లో వనే చూసుకుంటూ పతివ్రత లనిపించుకున్నారు. అది మీరు జ్ఞాపకం వుంచుకుంటే మంచిది**

చిత్తం— అంతపేరూ, అన్ని కాలాల్లో మాకే ఎందుకు? కొన్నాళ్ళు మిమ్మల్ని అక్కడ వుంచి మీకూ చరిత్రలో నిలిచిపోయే పేరు తెచ్చిపెడదామని! ఏం ఈ కోరిక తప్పా?!

**పి. ఆర్. డి, మంథని**

**మీరు మంగళసూత్రం బొట్టు ధరిస్తారా?**

అలవాటు లేదు!

**మీ జవాబులు చూస్తుంటే హిందూ సంస్కృతి మీద నమ్మకం లేనట్టుగా వుంది...**

ఏం? నా జవాబుల్లో హిందూ సంస్కృతి ఉల్లంఘించడం లేదా?! దానికి విరుద్ధంగా నేనేం చెప్పున్నాను?

**మీకు చాలా గర్వమండీ.**

చూశావా? సాటి ఆడదానివి కనుక యిట్టే గ్రహించావు!

**పి. ఆర్, ఉప్పులూరు**

**అసలు జీవితం అంటే నిర్వచనం ఏమిటి?**

జీవితం అంటే బ్యూటీ అని కలలు కంటారు. కాని కళ్ళు తెరిచి జీవితం ఒక డ్యూటీ అని గ్రహిస్తారు.

**డి. డి. వి, దుర్గాపూరు**

**పెద్దల సలహా పాటించడమా? స్వబుద్ధి పై నడవడమా?**

ఏం? పెద్దల సలహాకి స్వబుద్ధి జోడించకూడదా?!

**పి. ఆర్, ఆలూరు**

**నేను పత్రిక కొనడం ప్రశ్నావళి కోసమే అంటే ముఖస్తుతి అనుకొంటారేమో గాని అది నిజం. న్యాయంగా వుండవలసిన స్త్రీ జన పక్షపాతం మీలో వుంది. అది ధైర్యంగా బయటికి చెపుతున్నందువల్ల మిమ్మల్ని అభినందిస్తున్నాను.**

చాలా కృతజ్ఞురాలిని. నాలా కుండబద్దలు కొట్టినట్టు తమ అభిప్రాయాలని చెప్పడానికి జంకుతారు కొందరు— వాటివల్ల అనర్థాలొస్తాయని. దాగల చెడుని తల్చుకుని యిప్పుడు చెప్పవలసినది చెప్పక పోవడం— పిరికితనం అనుకుంటాన్నేను. అయినా— స్వజనపక్షపాతం— సహజం కదా. అది మగవారికి వుంటే మంచిదీ, ఆడవారికి వుంటే చెడ్డదీ అనుకునే వారి మాటలని లెక్క చెయ్యక్కర లేదు.

**టి. ఎన్. వి, కర్నూలు**

**మీరు నాస్తికవాదులా? ఆస్తికవాదులా?**

ఏది లాభసాటో చెప్పకపోతే ఎలా?!

**అసలు ఆత్మ అనే తెలివికి అర్థం ఏమిటి?**

దైనందిన జీవన ప్రవాహంలో— సరైన విలువ కట్టుకల్గడమే— తెలివి.

**మీరు మీ యింటికి 'ఇచట సలహా లివ్వబడును' అని బోర్డు కట్టవచ్చే?**

నిజమే. కాని సలహా యివ్వడం కంటే ఆ మంచి సలహావల్ల లాభం పొందడానికి కూడా తెలివితేటలు కావాలి!

**వి. పి. ఎన్, కర్నూలు**

**ఒకసారి పొరపాటుపడితే యిక అంతేనా?**

సోదరీ, తప్పులు చేయడం సులభం. తప్పులు చేయడం తప్పనిసరి. కాని, తప్పు చేశామని యిక ముందుకి సాగడం మానడం అంత తప్పు యింకొకటి వుండదు. ధైర్యంగా చేసిన తప్పు సరిదిద్దుకొనో, మరిచిపోయో— ముందుకి సాగాలి.

**వి. జె. వి, తెనాలి**

**మీరు ఆడవారు మగవారు సమానం అనుకుంటున్నారు. ఏలాంటి ఉద్దేశ్యంతో అలా అంటున్నారో తెలుపకలరా? మీరు విన్ని చెప్పి సమర్థించుకున్నా విన్ని జన్మలెత్తినా ఆడవాళ్ళు మగవారితో సమానం— విన్నటికీ కారు.**

చెవిటి వాడికి అరిచి చెప్తే వినిపించ వచ్చు. విన దలచుకోలేని మీలాంటి వాళ్ళ దగ్గిర చెప్పి ఏం ప్రయోజనం వుండదు. మగవారని— మీ తల్లి ఏడాది మోయలేదు. ఆడదాన్నని—నాతల్లి ఆర్నెల్లలో కనలేదు. నా ఒంట్లో రక్తంవుంది. మీ వంట్లోనూ వుంది. ఈ సమానత్వం ప్రతి పదికగా కొంచెం విశ్రాంతిగా కూర్చుని మీరు మాకన్న ఎందుకు ఎక్కువ అనుకుంటున్నారో— తెలియ చెప్పండి చూద్దాం.

**ఎమ్. వి. కె, మిర్యాలగూడ**

**మతాలు కులాలు వున్నంత వరకు సోషలిజం రాదంటాను.**

నిజమే కాని మన వాళ్ళకి కావలసినది సోషలిజం అమలులోకి రాడం కాదు. సోషలిజాన్ని గురించి గొంతు చించుకుని ఉపన్యసించడం... ఈ కులాలు, మతాలూ ఎలా పోతాయి.—యువతరం కూడా వాటినే పట్టుకు వేలాడు తుంటే?!

**పి. జి. పి; ఎస్. డి. ఎల్, ఖండవ**

**పల్లెటూరు, పైగా పై రాష్ట్రం అనే భేదాలు మీలో లేకపోతే — మేం మా ప్రశ్నలకు జవాబులు పొందుతాం...**

పొరపాటు సోదరా, నేనూ మీకు పైరాష్ట్రం మనిషినే కదా? నా కటువంటి సంకుచిత మైన అభిప్రాయాలు లేవు.

**పి. ఆర్. ఎస్, హైదరాబాదు**

**పాప పుణ్యాలను ఎలా నిర్ణయిస్తారు?**

మన చేతల ఫలితాలను పట్టి.

**కె. వి. ఆర్, విజయవాడ**

**నా ఇంట్లో ఆనందం లేదు ... శాంతి లేదు...**

తన యింట్లో లభించని ఆనందం మనిషికి మరెక్కడా వుండదు— తన అసంతృప్తిని ఎక్కడికి వెళ్ళినా, తనవెంట తీసుకొని వెడతాడు కనుక.

**ఎస్. ఎల్. కె, వరంగల్లు**

**అక్కయ్యగార్యూ, జీవితంలో మరుపురానిది ఏమిటి?**

నేను—నేను—నేను—అన్న అహం సోదరీ!

**ఎస్. ఏ. ఎన్, దేవీపట్నం**

**కట్నం తీసుకొన్న వరుడే అత్తవారింట స్థిరపడాలన్నారు. ఆ పక్షంలో అత్తవారికి ఆ వరుని మేపడం కూడా రెండవ దండగ కదా?**

ఎందుకలా? కోడలిని యింటికి తీసుకువెళ్ళి మేపు తున్నారా? అలాగే అనుకుంటే—సరి.

**సి. హెచ్. ఆర్. ఆర్, మిర్యాలగూడ**

**ఈ రోజుల్లో జీవితం ఎలా గడుపుతే బాగుంటుంది?**

హాయిగా... కష్ట పడకుండా.

**డి. వి. సిహెచ్, స్వర్ణ**

**వానరమే రూపాంతరం చెంది క్రమేగా నరుడైందంటారు. అదెంతవరకు నిజం?**

నూటికి తొంభై తొమ్మిది పాళ్ళు నిజమే ననిపించడం లేదూ బ్రదర్! ●

## సమైక్యకుటుంబం

కథ




కాలేజీ ఆవరణలోకి అడుగు పెట్టేవరికి, నాకోసం కొండంత ఆశ్చర్యం కాసుక్కూచుంది. కాలేజీలో విద్యార్థులంతా ఆ గోడల చుట్టూచేరి తమకొచ్చిన అక్షర పరిజ్ఞానాన్ని సార్థకం చేసుకొంటున్నారు. మనిషి నాలోనూ ఆ క్షణంలో కుతూహలం కలిగింది. శారీరకంగా కదలక పోయినా, చక్షువులను ఆ గోడలకేసి పంపించాను. ఆ గోడలమీద రాతలు నా కొచ్చిన చదువును వెక్కిరిస్తూ కనబడ్డాయి. చదువుకో గలిగినందుకు ఇంతకాలం నా మనసంతా ఉప్పొంగి పోయేది. గర్వంతో మనసంతా పులకించిపోయేది. కానీ ఈ నాడు...ఈనాడు ఆ అక్షరాలు చదవగలిగినందుకూ, నాకు ఆ మాత్రం చదువు అబ్బినందుకూ నా దౌర్భాగ్యానికి కించ పడ్డాను.

ఆ గోడలమీద, మనిషిలోని మనసు స్పష్టంగా నాట్యమాడుతోంది.

మనిషి మనసెంతటి దౌర్బల్యానికి పాలుపడిపోతుందో ఆ గోడలమీద రాతలు స్పష్టంగా చెబుతున్నాయి.

మనిషి ఎంత చదువుకొన్నా మనసెంతగా కుంచించుకు పోగలదో ఆ రాతలు తెలియ జేస్తున్నాయి.

మనసు తనమీదున్న ముసుగులన్నిటిని ఆ క్షణంలో విడిచేసి, గోడలమీద నగ్నంగా నిలబడి ఉంది.

ఆ అక్షరాలను మరోసారి చదువుకొన్నాను — సగానికిపైగా బూతులు. మిగతా సగానికి అర్థంలేదు. అయినా విషయమంతా తెలిసిపోతోంది. క్షణంసేపు సిగ్గుతో చచ్చిపోయాను. ఆ తర్వాత ఈ లోకంలోకి వచ్చిపడ్డాను — వెంటనే అటుకేసి కదిలాను. అక్కడున్న విద్యార్థులను మెల్లిదిగా మందలించాను —

'ఏమిటి రాజా ఇది!' అనడిగాను.

ఆ అబ్బాయి — రాజా — నాకేసి చూసి ఆశ్చర్యపోయాడు. వెంటనే తేరుకొంటూ అన్నాడు—' 'ఇక్కడ...అదే గోడలమీద...' ఇంకేమీ అనలేకపోయాడు.

'...సరేలే. వీళ్లందర్నీ వెళ్ళమను. చూడు ఎంత అసహ్యంగా ఉందో? — ఛ చదువుకొన్నందుకు సార్థకత ఉండాలి!' కొంచెం ఆవేశంగానే అన్నాను.

'చదువుకొన్నవాళ్ళు రాసి ఉండర్లెండి!' అన్నాడెవడో ఆ గుంపులోంచి.

నాకు నవ్వొచ్చింది — 'నిజమే, చదువు కొన్నవాళ్ళు రాసి ఉండరిది! అక్షరాలు తెలిసీ చదువుకోని వాళ్ళుంటారుగా, వాళ్ల పనే ఇది! సరే లెండి, నడవండి!' అన్నాను.

నెమ్మదిగా, ఒకరి తర్వాత ఒకరు, కదిలారు.

అందరూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయాక నెమ్మదిగా స్టాఫ్ రూంకేసి కదిలాను. అక్కడా ఇదేచర్చ — దేశానికి ఎన్ని సమస్యలున్నాయో, ఎన్ని ప్రశ్నలున్నాయో నాకు సరిగా తెలీదు. ఇంత పెద్ద దేశంలో అరఅణువంత ఉండే ఈ స్టాఫ్ రూంకు మాత్రం తలకు మించిన సమస్యలు. లెక్కలేనన్ని ప్రశ్నలు — ఇక్కడుండే అరడజను మందికీ ఒక గొప్ప నమ్మకము ఒకటుంది — ఈ దేశం అనుభవిస్తున్న 'సేధాంల దారిద్ర్యానికి' — అంటే 'ఇంటలెక్చువల్ ఇన్ సఫిషియెన్సీ'కి — వాళ్లందరూ జవాబులుట! దేశం ఎన్నో ఏళ్లనుంచీ ఎదుర్కొంటున్న జాతీయ, అంతర్జాతీయ సమస్యలన్నిటికీ వీళ్లు అరక్షణం ఆలోచించకుండా, ఆరుగురూ ఆరు ఉచిత సలహాలు పారేస్తారు జాతీయ, అంతర్జాతీయ సంక్షోభాలకే కాక వీళ దగ్గర రాష్ట్ర, జిల్లా, తాలూకా, గ్రామస్థాయి సమస్య కూడా పరిష్కారాలు, లేకపోతే పరిష్కార పథకాలూ ఉన్నాయి. నాకొక్కొక్కసారి అనిపిస్తుంటుంది — వీళ్లనందర్నీ ఓ రోజుపాటు దేశ ప్రధానమంత్రికి సలహాదారులుగా నియమించేస్తే, దేశంలో పరిస్థితి అటో, ఇటో తేలిపోతుంది — నష్టో విప్లవం వస్తుంది. లేకపోతే ప్రశాంతత నెలకొంటుంది. అంతే!!

స్టాఫ్ రూంలోకి వెళ్లేసరికి, నన్ను చూశాక ప్రశాంతత నెలకొంది. ప్రశాంతత నెలకొన్న వెంటనే చర్చలు! కాబట్టి క్షణం

నేను ఆలోచించి నేనే ముందుగా మాట్లాడటం ప్రారంభించాను—ఆ మాట్లాడటం, ఏ ఒక్కర్నీ ఉద్దేశించి కాకుండా, అందర్నీ సమిష్టిగా ఉద్దేశించినట్లుగా భావం వచ్చేటట్లుగా మొదలెట్టాను— 'మనం అంతా చదువుకొన్న వాళ్లం—' అందరూ తెల్లపోయి చూశారు.

ఈసారి తెల్లపోవటం నా వంతయింది. నిజమే — వీళ్లను కలుపుతూ, మనం 'మనం అంతా చదువుకొన్న వాళ్లం' అని అనటం తెలివి తక్కువ పనే! నన్ను నేనే సరిచేసుకొంటూ అన్నాను —' మనలో చాలమంది చదువుకొన్న వాళ్లం! కానీ, మన బతుకు, మనలో ఒకరిమీద ఇంత అసహ్యంగా, కారుకూతలు రాసుకోవటం చాల అమానుషమైన సంగతి — ఈ సంగతి మనం అంతా వింతో తేలికగా ఏమీ జరగనట్లుగా, నిర్లిప్తంగా పట్టించుకోకుండా కూర్చోవటం ఇంకా ఘోరం.'

ఆరుగురు మేధావుల్లో ఒకతను అన్నాడు. 'మనమేం చెయ్యగలం రావుగారూ! ఇది వాళ్ల పర్సనల్ విషయం!'

'పర్సనల్ విషయం అని మనం అంతా చేతులు ముడుచుకొని కూర్చొని ఉంటే బాగుండేది. కానీ ఆ గోడలమీద రాత లేమిటి?'

'అంటే మేం రాశామనా?'

'లేకపోతే మేం రాయించామనా మీ ఊహ?'

నన్ను నేను నిగ్రహించుకొంటూ అన్నాను—'ఆ గోడలమీద అసభ్యపు రాతలు మీరు రాశారనీ, మీరే రాయించారనీ నేననలేదు. అది నా ఉద్దేశమూ కాదు! కానీ నా బాధంతా ఏమిటంటే మనలో ఒకడికి జరుగుతున్న ఈ అన్యాయానికి మనం అంతా ఉలిత నిశ్శబ్దంగా, కేవలం ప్రేక్షకులుగా నిలబడిపోయామనే! ఒక్కరంటే ఒక్కరుకూడా నోరెత్తుకుని ఎదురు తిరగకపోవడంకన్నా అన్యాయం మనం ఇంకేమీ చేయలేము. ఇంతగా ఒకరి వ్యక్తిత్వాన్ని చంపే ప్రయత్నం జరుగుతోంటే, మనం చూస్తూ ఊరుకొండి పోవటం ఏమీ బాగలేదు—'

'ఏం చేద్దామంటారు?' ఒకతను అన్నాడు.

'మనం ఏం చేసినా ఉపేక్షించి— నా

# సెపరేషన్ జిందా...

ఊహ! ఎందుకంటే వారిద్దరూ ఈ విషయాన్ని పరిష్కరించుకోవాలేగానీ, మనం చేసేది ఏమీలేదు!'

'అదీ నిజమే ఇంకొకరి కుటుంబ విషయాల్లో జోక్యం కలిగించుకోవటం దురాక్రమణే అవుతుంది!'—అంతర్జాతీయ వేత్త వ్యాఖ్య ఇది.

'ఒక విషయం రావుగారూ — అంజనా దేవి, విజయ్‌గార్ల విషయం గోడల మీద

## ఓ ముద్దుగుమ్మా!

రాష్ట్రంలో సెపరేషన్
అటూ యిటూ రిసొల్యూషన్
సారీ సర్.. నో సొల్యూషన్
ఓ ముద్దుగుమ్మా!

వచ్చిన రాజుగారి ఫర్మానా
సుప్రీంకోర్టు వారి ఫరానా
అంతే! అటూ యిటూ హైరానా
ఓ ముద్దుగుమ్మా!

ఇదేమి ప్రజాస్వామ్యం?
ప్రజల మాట వినటం పూజ్యం!
ఉందనా అండన సీఆర్పీ సైన్యం?
ఓముద్దుగుమ్మా!

ఇందిరాకుందేటికి మూడేకాళ్ళు
చస్తే చస్తారు చచ్చేవాళ్ళు
ఇందిరా జిందాబాదుగాళ్లే మంచోళ్ళు
ఓముద్దుగుమ్మా!

కలిసివుండి బాధ పడటం
కన్నా—లేకుండా ఏకపటం
కాదామంచిది విడటం
ఓముద్దుగుమ్మా!

ఇద్దరూ పడితేపట్టు
ఇందిరమ్మ చేస్తుందా బెట్టు
ప్రజమాట కాదన్న వారి ఆటకట్టు
ఓముద్దుగుమ్మా!

ఓం శాంతిః శాంతి
మాట వింటాం ఉంటే ప్రశాంతి
ఇదే వల్లని వింటారన్నది భ్రాంతి!
ఓముద్దుగుమ్మా!

—'మహగా'

ఎక్కటం బాధాకరమైన సంగతే కాదు... కానీ ఈ విషయంలో మనం ఏంచెయ్యగలమో నాకర్థం కావటం లేదు.'

'గోడల మీదకెక్కటం అంటే తేలిక టోయ్ రాజూ! చరిత్రలో సువర్ణాక్షరాలతో రాసివెళ్లే లెక్క!' వేళాకోళంగా అన్నాడు ఇంకొకతను.

నాకు ఒంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకినట్లయింది. వీళ్ళతో ఏ విషయం గురించి మాట్లాడినా అది నా తెలివి లేమిని చూపిస్తుందేగానీ ఇంకేమీ కాదని పించింది. ఆ మనుషులున్న అడివిలోంచి మెల్లిగా బయటకు నడిచాను — కాలేజీ ప్యూన్‌ను పిలిపించి, వో రెండురూపాయ లిచ్చి, ఆ గోడల మీద సున్నం వెయ్యమని చెప్పాను.

కాలేజీ ఆవరణలోంచి బయటకొస్తోంటే ఆ రాతలు నన్ను తరుముతున్నట్టుగా అని పించి, వెనక్కు తిరిగాను.

'సెపరేషన్ జిందాబాద్'—

'అంజనా విజయ్‌ల మధ్య అగాధం'—

'సుఖసౌఖ్యాలకు విడిపోవడమే శ్రేయస్కరం.'

'ఎంతకాలం? ఇంకెంత కాలం?

—సంపాదిమ్మా బానిసత్వం ఇంకెంత కాలం?'

—ఇంకా నేను రాయలేనివి, చదవలేనివి ఎన్నో......

* * *

సాయంత్రం వరకూ ముళ్లమీద కూర్చున్నట్లుగా ఇంట్లో కూర్చున్నాను. ఇంట్లో రగులుకొంటున్న అగ్ని ఉంటే, సావకాశంగా విశ్రమించే తత్వం కాదు నాది.

కాలేజీ స్టాఫ్ యూనియన్ ప్రెసిడెంట్‌గా కాకపోయినా, ఒక బాధ్యతగల పెద్దమనిషిగా నా విధి నేను నిర్వర్తించ దలిచాను. అంజనాదేవిగారు, విజయ్ - ఇద్దరూ నా కాలేజీలోనే లెక్చరర్స్. మంచి జోడీ అని నేనెంతగానో సంతోషించాను. మొదట్లో వాళ్లిద్దరూ ఇద్దరిదీ ఒకటే మనసు, ఒకటే శరీరం అనే విధంగా ఉండే వారు.

కానీ వాళ్ళిద్దరి మధ్యా ఇంతటి లోయ లున్నాయనీ, ఇద్దరూ వో అగ్నిపర్వతం మీద కూర్చున్నా కానీ, వారి గుండెల్లోనే లావా దాగుందన్నీ, అది ఇంత ఘోరంగా

ఒకరోజు విజృంభిస్తుందని అనుకోలేక పోయాను.

నిజమే—పైకి కనబడే మనిషికీ, లోన దాగున్న మనసుకూ ఎంత దూరమో గదా!

సాయంత్రం విజయ్ వాళ్ళ ఇంటికి వెళ్ళాను. నేను వెళ్ళేసరికి విజయ్ నసారాలో కూర్చొని పేపరు చదువుకొంటున్నాడు. మనిషిలో జీవకళ అన్నది ఎక్కడా కన బడ్డం లేదు, మనిషి పేలవంగా, జీవచ్ఛవంలా ఉన్నాడు— నన్ను చూసి పేలవంగా నవ్వాడు. నేనూ నవ్వలేక పోయాను.

కొంతసేపు అంతర్జాతీయపరిస్థితి మీద మాట్లాడుకొన్నాము. అది [illegible] ఆధ్వాన్నంగా ఉందనీ, జాతీయ రంగం లోనూ పరిస్థితి అంత సంతృప్తికరంగా లేదనీ అనుకొన్నాము. ముందు ఇల్లు గెలిచి రచ్చగెలవమన్నారు కానీ మేము ముందు రచ్చబండ రాజకీయాలు చర్చించి, తర్వాత కుటుంబ విషయాల్లోకి దిగాము— విజయ్ క్షణంసేపు శంకించాడు. చాల డెలికేట్ పొజిషన్ అని, కాదనను. అందుకే నెమ్మదిగా నేనే మళ్ళీ అన్నాను. 'ఇలాంటి విషయయాల్లో తల దూర్చకూడదనుకోండి! కానీ, చూసూ చూసూ ఊరుకోలేక...'

'నిజమేనండీ — అంతా అంజా మూర్ఖత్వం. చేతులార చేసుకొన్నది అనుభవించాలి కదండీ!' అంటూ ఆగాడు.

'మరేమీ అనుకోకండి— అసలు ఇద్దరికీ గొడవ ఎలా ప్రారంభమైంది?'

చెప్పాడు — 'గొడవ! — ఇది ఆర్థిక సమస్యలెండి. నేనదో తన్ని దోచుకు తినేస్తున్నానని ఊహ ఏర్పడిపోయింది అంజాకి ...'

నేను ఉలికిపడ్డాను— పెళ్ళి చేసుకొంటే ఒకళ్ళొకరు దోచుకు తినడానికేనన్న సంగతి నాకు తెలిందికాదు. కానీ నేననేది శారీరకంగా!—ఇక్కడ 'ఆర్థికం'గా ఒకరినొకరు 'దోచుకు తినటం'... తమాషాగా ఉంది, కొత్తగా ఉంది!

'అంటే నాకర్థం కావటంలేదు ...'

'నిజమే, అసలు మొదట్లో నాకూ అర్థం కాలేదు. నన్ను 'దోపిడీదొంగ'నంది. మొదట తన మనసునూ, తర్వాత తన శరీరాన్నీ, ఆ తర్వాత తన సంపాదనా దోచుకుతినేసినానటోంది. ఇద్దరం కలిస్తే వెన్నెలలు విరుస్తాయనన్నానట! శరీరాలు కలిస్తే సుఖాలు పంచుకోగలమన్నానట! ఇంతా చెప్పి, చివరకు తనకు ఆర్థిక స్వాతంత్ర్యం లేకుండాచేసి బానిసగా చేశానట! తన ఇంట్లో తను 'ద్వితీయశ్రేణి పౌరుడి' లా గడుపుతోందట. తనదంతా దోచుకుతిన్నా, విశ్వాసం లేకుండా ఉందిట నాకు — ఇవండీ ఆరోపణలు!' అన్నాడు విజయ్.

ప్రజల జీవితాల్లో రాజకీయాలు ఎంతటి ప్రాముఖ్యాన్ని వహిస్తాయో అర్థం అవుతోంది నాకు. 'ఆర్థికస్వాతంత్ర్యం', 'దోపిడీ', 'బానిస'. 'ద్వితీయశ్రేణి పౌరుడు'—నాకు నవ్వొచ్చింది.

'ఇంతకీ ఆరోపణలు నిజమంటారా? కాదా?!'

'ఆరోపణలు అంటే ఆరోపణ అనే అర్థం. అది నిజమైతే ఆరోపణ అనరు కదండీ!...ఊఁ, నిజమేనేమోననిపిస్తోంది — ఇద్దరిలో ఒకరిది బానిస బ్రతుకయిపోయింది. కాదనను. అంజా అంటోంటే నాకూ తెలుస్తోంది — నేనెంతటి బానిస బ్రతుకు బతుకుతున్నానో! నిజం చెప్పాలంటే ఇంట్లో ద్వితీయశ్రేణిలో బతికేదీ, బతుకుతున్నదీ నేనే! ఆర్థిక అసమానత ఇంట్లో ఎంత ఘోరంగా తాండవ మాడుతోందోనని ఆలోచిస్తే మతిపోతోంది. అంజా కన్నా నేనెక్కువ సంపాదించేది ఎంత వాస్తవమో, ఇంట్లో నాది బానిస బతుకన్నది అంతే నిజం!'

నాకు ఆశ్చర్యంతో పాటుగా ఆవేదనా కలిగింది. భార్యాభర్తలలో యజమాని, బానిస అంటూ ఈ భేదాలేమిటండీ పిచ్చిగా!'

'మొదట్లో పిచ్చిగా అనిపించినా, ఇది చాలా సీరియస్ ప్రాబ్లం అయిపోయింది రావుగారూ!'

నాకేమనాలో అర్థం కాలేదు — ఒక్క విజయ్ నాదనేవింటే నాలో పక్షపాత దోరణికి పునాదులు పడతాయనే భావం కలిగి బయటకు నడిచాను.

ఇంటికి వచ్చేసరికి ఇంట్లో నాకోసం అంజనాదేవి కాచుకొనుంది. నన్నుచూసి నవ్వింది పలకరింపులాగ. క్షణంసేపు తర్వాత అంది అంజనాదేవి. 'మీరు ఆయన దగ్గరికి వెళ్ళొచ్చారుటగా!'

ఔనన్నాను.

'ఏమన్నా రేమిటి?'

'ముందు మీరేమంటారో చెప్పండి!' నవ్వుతూ అన్నాను.

'అనడానికి ఏముందండీ? ఇంతకాలం తర్వాతనైనా నాకు కనువిప్పు కలిగినందుకు దేవుడికి థాంక్స్ చెప్పుకొన్నాను. ఇప్పటికైనా స్వేచ్ఛావాయువులు పీల్చాలనే కోరిక కలిగింది నాకు. ఈ దోపిడీదారునుంచి విముక్తి ఎంత త్వరగా లభిస్తే అంత మంచిదనిపిస్తోంది!' అంది అంజనాదేవి.

అంజనాదేవి అంటున్న మాటలలో నిజం ఉందో లేదోగానీ, ఆవేశంఉంది; పట్టుదల ఉంది; పంతం ఉంది; మొండితనం ఉంది—



# సెపరేషన్ జిందా...

'అసలింతకూ ఏం జరిగిందండీ ?'

'ఏం జరిగిందని నెమ్మదిగా అడుగుతారేం? ఒకటో తారీఖు సంపాదించినదంతా తీసుకెళ్ళి ఆయన చేతుల్లో పోయటం — ఆయనదంతా పేకాటలో తగలెయ్యటం— పేకాటలో పోగొట్టుకొనేది డబ్బేకదా అనే ఊహతో ఊరుకొన్నాను. పోయిన డబ్బును సంపాదించుకోవచ్చుగదా, సంపాదించుకోగలిగినంత కాలం తగలేసినా పర్వాలేదు అనే అనుకొనేదాన్ని ఇంతకాలం! కానీ...మనసుకు గాయం తగిలితే...భరించటం నావల్ల కాదు—'

'ఏం జరిగింది?'

'చెప్పనా?— పెళ్ళయి ఇంతకాలం అయిందా — మొన్న మొన్నటి వరకూ ఇంట్లో ఆయన తమ్ముడో, చెల్లెలో, ఎవరో ఒకరు ఉంటూనే వచ్చారు. నేనేమైనా అన్నానా? అప్పటినీ భరించాను. కానీ ఇదుగో ఈ అవమానం — నా వల్ల కాదు ... అందుకే అంటున్నాను 'ఫ్రెండ్లీ సెపరేషన్...'

'ఏం జరిగింది అవమానం మీకు?'

'మీకీ సంగతి చెప్పితీరాలి. కాదనను. మొన్న కాలేజీలో బోటనీ డిమాన్‌స్ట్రేటర్ ఖాళీ వచ్చింది గదా— మా చెల్లెలు కాంత, ఉందిగదా; మీరేదో అవస్థపడి ఆ ఉద్యోగం ఇప్పించండి అంటే ఈయన చేసిందేమిటో తెలుసా — తన తమ్ముడికి ఇప్పించుకొన్నారు. తన తమ్ముడి గురించి చెప్పి ఉండకపోతే, నా చెల్లెలికే వచ్చేదేమో ఆ ఉద్యోగం! మనిషిలో ఇంత పక్షపాత ధోరణి, నెపోటిజమ్—ఉండకూడదు రావుగారూ! మీకర్థం కాదు నేను అనుభవిస్తున్న ఈ మానసిక చిత్రహింస!'

అంజనాదేవి అన్నట్టుగా, నాకు నిజంగా అర్థంకాలేదు. వాళ్ళిద్దరి మధ్యా చెలరేగుతున్న ఈ గొడవ కేవలం ప్రణయ కలహమో, అంతర్యుద్ధమో! మొత్తంమీద వీళ్ళ ఇంట్లో మాత్రం విప్లవ ధోరణులు కానవస్తున్నాయి.

ఊళ్ళో, ముఖ్యంగా ఆడవాళ్ళు విప్లవం లేవదీయడం సమాజానికి ముఖ్యంగానూ మగవాళ్ళకు అంత ఆరోగ్యకరం కాదు. అందుకే ఎలాగైనాసరే, ఈ విప్లవాన్ని అణచివేయాలనే ధోరణి కలిగింది నాకు.

ఏపనైనా చేయాలంటే సామదాన భేద దండోపాయాలని నాలుగు మార్గాలున్నాయన్న సంగతి నాకు తెలియంది కాదు.

అందుకే ముందుగా ఇద్దరిమధ్యా సామరస్యం సమకూర్చడానికి శక్తి వంచన లేకుండా ప్రయత్నించాను. కానీ ఫలితం లేకపోయింది. ఆ తర్వాత దానం — అంటే ఇద్దరి మధ్యా రాజీ కుదర్చడానికి కొన్ని పథకాలు తయారు చేశాను—ప్రతి నెలా అంజనాదేవి జీతం ఇకముందు ఇంటికి ఖర్చుపెట్టడానికి వీల్లేదనీ, భార్యను భరించడం భర్త విధి కనుక, విజయ్ ఒక్కడే సంసారభారాన్ని మోయాలనీ, ఇంతకాలం అంజనాదేవి తన కుటుంబానికి, విజయ్ తన కుటుంబానికి చేసినంతగా, సాయం చేయలేక పోయింది గనుక, విజయ్ నెలకో వంద రూపాయలు అంజనాదేవికి గ్రాంట్‌లా ఇవ్వాలనీ అన్నాను నేను—అంజనాదేవి ఆనందంగా ఒప్పుకొంది. పై షరతులన్నీ న్యాయసమ్మతంగా ఉన్నాయనీ, తనకు జరిగిన అన్యాయం ఎలాగైనా సరిదిద్దబడేది కాదనీ, అయినా పెద్దమనిషిగా నేను కుదురుస్తున్న ఒప్పందానికి తన ఆమోదాన్ని తెలపడానికి సిద్ధమేనంది అంజనాదేవి.

విజయ్ షరతులన్నీ విని నవ్వేశాడు—

'ఇంతకాలం తన్ను నేను పోషించుకొన్నానన్న మాట అబద్ధంగానీ, ఇకపై నన్ను తను పోషించుకుంటున్నదన్న సంగతి మాత్రం నిజం! నా ఇల్లు కొల్లగొట్టి, తన ఇల్లు నింపెడతాననడం హాస్యాస్పదం—ఏమైనాసరే! ఈ దోపిడీని నేను అంగీకరించను — పైపెచ్చు నెలకో వందరూపాయలు గ్రాంటనే సంగతి మీ పక్షపాత వైఖరికి మంచి నిదర్శనం' అన్నాడు విజయ్.

విషయం మరీ కాంప్లికేటెడ్ అయిపోయింది. మొదట ఆర్థిక అసమానతలతో మొదలయి, ఆ తర్వాత ఉద్యోగావకాశాలతో పెరిగి, చివరకు గొడ్డళ్ళ వరకూ వచ్చేసింది—

ఎలాగైనా విజయ్‌చేత షరతులకు అంగీకరింపజేస్తానని అంజనాదేవికి మాట ఇచ్చి, ఇలా ఉత్త చేతులతో తిరిగి వెళ్ళి ఆవిడకు కనిపించటం భావ్యం కాదనిపించి, పైపెచ్చు కాలం గడిస్తే, కొంచెం ప్రశాంత వాతావరణం ఏర్పడితే

ఆ తర్వాత చర్చలు కొనసాగించ వచ్చుననుకొన్నాను.

* * *

ఆ తర్వాత రోజున కాలేజీకి వెళ్లేసరికి కాలేజీ గోడలు మళ్లీ అక్షరాలతో అలంకారాలు దిద్దుకొన్నాయి. క్రితంసారి అంజనాదేవి, విజయ్‌ల గురించే రాస్తుంది కానీ ఈసారి ఆ ఇద్దరిపేర్లతో బాటుగా నా పేరూ కొంత స్థలం సంపాదించుకోగలిగింది.

'అంజనాదేవి — విజయ్‌ల సమస్యకు రావుగారి రాజీ ప్రయత్నాలు'

'సమైక్య కుటుంబం వర్ధిల్లాలి—'

'కలిసి ఉంటే కలదు సుఖం. వేరు పడితే తీరని దుఃఖం'

'రావుగారి రాజీ, భార్యాజీ దోపిడీ...'

...ఇంకా విన్నే — ఈసారి నాకు ఆశ్చర్యమూ కలిగింది, నేను రాజీ ప్రయత్నాలు చేస్తున్నట్లుగా, ఆ ప్రయత్నాల్లో అంజనాదేవికి కొంచెం ప్రాముఖ్యత ఇస్తున్నట్లూ ఈ గోడల కెలా తెలిసింది? ఈ గోడల మీద చరిత్రకారు లెవరోగానీ, వీరికి మంచి సీక్రెట్ సర్వీస్‌కూడ ఉన్నట్లుంది.

నాలో పంతం పెరిగింది — ఏలాగైనా నా ప్రయత్నాలు ఫలించి తీరాలని. ఈసారి అంజనాదేవిని కలుసుకోవాలని నేను అనుకుంటుండగనే, ఆవిడే నాకోసం వచ్చింది. రావటం రావటం వరదలాగా, పెను తుఫానులాగా వచ్చింది. వచ్చి నన్ను వాలుగూ దులిపేసింది — 'మీ పెద్దతనకు ఇనెక్కడి బుద్ధండీ? రాజీచేస్తామని వెళ్లి ఫెయిలయిపోతే నాకు చెప్పనక్కర్లేదా ఏం? పైపెచ్చు, ఇలా మా ఇద్దర్నీ విడిపోనీకుండా మమ్మల్ని చిత్రవధ చేస్తారా? మా ఇద్దర్నీ కలిపి ఉండమంటూ ఇద్దరిమధ్యా మరికొంత అగ్నిని పెంచి, తమాషా చూడాలనుకొంటున్నారా? మీ వెధవ బుద్ధులు పోనిచ్చుకొన్నారు కాదు — మీలాటివాళ్లు వందమంది మా ఇద్దర్నీ కలిసి ఉండమన్నా మేం ఉండం— మేం నిర్ణయించుకొన్న తర్వాత మీరెవరు? కలిసి ఉన్నంతకాలం ఉన్నాం— ఇక విడిపోదలుచుకున్నాం! అంతే! ఆటు సూర్యుడు ఇటు పొడిచినా, హాహాకారాలు అడ్డొచ్చినా మేం విడిపోయి తీరతాం!'

నా తల తిరిగి పోయింది.

ఇట్లా నిమిత్తొచేక, నా ప్రయత్నాలు ఇలా బెడిసిపోయాక, తల తిరిగి కాలేజీకి బయలుదేరాను. అక్కడ గోడలమీద మళ్లీ రాతలు మారిపోయాయి — ఈసారి నేను తిన్న చివాట్లూ, చెప్పుదెబ్బలూ గోడమీద స్థలం చూసుకొన్నాయి.

'సెపరేషన్ జిందాబాద్—'

'మధ్యవర్తి ముర్దాబాద్...'

'రాజీపథకం నశించాలి—'

'విడిపోవడం మా జన్మహక్కు...'

నాకు వళ్లు మండిపోయింది.

క్షణం నన్నునేను సంబాళించుకోలేక పోయాను — కాలేజీ ప్యూన్ బాలయ్యను పిలిపించాను. గోడలమీద రాసిన రాతల్లో నాపేరు ఉన్నదంతా చెరిపించాను. ప్రతికాలంటే ఉన్నపేరు నిలబెట్టుకోవాలంటే రంగుమార్చక తప్పదనిపించింది.

నున్నం గోడమీద జేగురురంగు అక్షరాలు రాయించాను — 'సెపరేషన్ జిందాబాద్... సెపరేషన్ జిందాబాద్...సెపరేషన్ జిందాబాద్...'

విడిపోతామన్న ఇద్దరిమధ్య నిలబడ్డ మధ్యవర్తి ఓడిపోక తప్పదనే సంగతి నాక్కొంచెం ఆలస్యంగా తెలిసింది.

నేడో రేపో — ఇంతకాలం కలిసిఉన్న భార్యాభర్తలు విడిపోయి — సుఖంగా కాలం గడుపుకొంటారనే సంగతి నిజం!!

సెపరేషన్ జిందాబాద్ — ●

## భారతీయ చిత్రకారులు

రచన, చిత్రాలు: కాలిపు సోమరాజు

### హరీశ్ రావత్

జననం: 1925. జన్మతః కళాకారుడవాలంటారు. అది సరే, వాతావరణంకూడా కొంత వరకు తోడ్పడాలి. శ్రీ హరీశ్‌గారు సముద్రతీర ప్రాంతంలో జన్మించారు.

1952 లో చిత్రకళలో డిప్లమా తీసుకొన్నారు. వీరి చిత్రాలు యింతవరకూ 14 సార్లు ప్రదర్శిత మయ్యాయి. చాలా బహుమతులు కూడా లభించాయి.

కాళిదాసు ప్రదర్శనిలోను, టాగూరు ప్రదర్శనిలోను, బొంబాయి ఆర్ట్ సొసైటీ వార్షిక ప్రదర్శనిలోను వీరి చిత్రాలకు బహుమతులు లభించాయి. అఖిల భారతీయ బహుమతుల కూడా లభించాయి. జపాను ప్రదర్శనానికై వీరి చిత్రాలు పంపబడ్డాయి. భిత్తి చిత్రాలు, రేఖాచిత్రాలు వీరు ఆధునికరీతిలో రచిస్తారు. వీరిది అలంకరణశైలి.




### జరిగిన కథ

రమణమూర్తి, శేఖర్ బాల్య స్నేహితులు. రమణమూర్తి ఒక కంపెనీలో పని చేస్తున్నాడు. శేఖర్ స్టేట్స్‌కి వెళ్ళి భార్య సుమతితో సహా ఇండియాకు వచ్చి రమణమూర్తిని చూడ్డానికి వచ్చాడు. రమణమూర్తి భార్య ఇందిర, సుమతి ఇద్దరూ ప్రాణ స్నేహితులు. శేఖర్‌కి పేకాటపిచ్చి. రమణమూర్తికి అలవాటు చేశాడు. శేఖర్ రిజైన్‌చేసి హైదరాబాదు మారడానికి ప్రయత్నాలు చేశాడు. మామగారు పోవడంతో ఆవూరు బయల్దేరింది ఇందిర పిల్లలతో. తండ్రి రమణ పేరుతో వీలునామా రాయడం చాలమందికి కష్టం కలిగించింది. మిగిలిన వ్యవహారాలని లాయర్‌గారికి అప్పగించి చెల్లెలు శిరీష్‌ని తీసుకుని తిరిగి వచ్చాడు రమణ. శేఖర్, సుమతి వెళ్ళిపోయాక ఇందిర అదోలా ఉంటుంది. రాజారావుని ప్రేమించింది శిరి. ఇందిర ఆమెకి వదిన. వదినతో రాజారావు విషయం చెప్పింది. విజయసారథి, శిరీష్‌రాణికి స్నేహితుడయ్యాడు. చాలకాలం తర్వాత శేఖర్, రమణ మళ్ళీ ఉల్లాసంగా కలుసుకున్నారు.

## 13

కాలప్రవాహం వడివడిగా పరుగులిడుతోంది. శిరి మెడిసిన్ కోర్సు పూర్తిచేసి హౌస్‌సర్జన్ చేస్తూంది. శ్రీధర్ బి.ఎస్.సి. పాసైనాడు. ఎమ్. ఎస్. సి. కి వెళ్ళాలన్న ముందు ఆలోచనతోనే బి. ఎస్. సి. చదివాడు. తీరా ఇప్పుడు అతడికి ఎమ్.ఎస్.సి.కి వెళ్ళాలని లేదు. ఎమ్. బి. కి వెళ్తానన్నాడు. శిరి చదువుకే రమణ కొంత అప్పు చెయ్యవల్సి వచ్చింది. ఆమె చదువు పూర్తిఅయినాక్క రెండు మూడు సంవత్సరాలు కాస్త వూపిరిపీల్చుకుని అప్పులు సర్దుబాటు అయినాక్క, శ్రీధర్‌ను ఎమ్. ఎస్. సి. కి పంపాలనీ, ఈలోపుగా శ్రీధర్ ఏదన్నా జాబ్‌చేస్తే కొంత సహాయంగా వుంటుందని రమణ ఆలోచన. కానీ శ్రీధర్ ఆలోచన వేరు. రమణ తన ఆర్థిక స్థితిగతుల్ని వివరించి [illegible] నచ్చచెప్పినా — చెవికెక్కించుకోక తనమాటవే పట్టుకూర్చున్నాడు.

శ్రీధర్ చిన్నతనంనుండీ ఎంతో మృదువైన స్వభావం గలవాడు. తల్లి, దండ్రుల పట్ల ఎంతో భక్తి ప్రపత్తులు వుండేవి. స్కూల్లో వినయ విధేయతలుగల విద్యార్థిగా పేరుతెచ్చుకున్నాడు — ఆటల్లో సహితం తనతోటి వారిలో ఘర్షణపడేవాడుకాదు —

అలాటివాడు — స్నేహితుల ప్రభావమో — వయస్సు తెచ్చిన దుడుకుతనమో, ఇటీవల అతడికో ఆశ్చర్యకరమైన మార్పువచ్చింది. తండ్రి తనకేదో అన్యాయం చేస్తున్నాడనీ — అందరికోసం తనెందుకు త్యాగం చేయాలన్న స్వార్థం — అతడి వూహాలు వక్రమార్గాల్లో పయనించేట్టు చేశాయి. మడత నలగని దుస్తులు వేసుకుని స్నేహితులతో బాతాఖానీ కొడ్తూ — వచ్చిన సినిమాకల్లా హాజరు వేయించుకోటమే జీవిత ధ్యేయంగా మారిపోయింది. ఇప్పుడు స్నేహితుల ప్రోత్సాహంతోనే ఎమ్. బి.కి వెళ్ళాలని పట్టుదలగా కూర్చున్నాడు. కొడుకులో వచ్చిన ఈ మార్పుకు — రమణా — ఇందిరా ఎంతో బాధపడ్డారు; మైనరు వెళ్ళినవాడిని ఏమని మందలించగలరు? తనకు తానుగా తెల్సుకోవాలిగానీ, అసలు ఇతనొక్కడేకాదు — నేటి యువక లోకంలోనే ఒకవిధమైన అశాంతి ప్రజ్వరిల్లుతోంది. వారికేంకావాలో వారికి తెలీదు. ఇతర్లు చెప్పితే వినరు. ఈ సమస్యని కాలమే పరిష్కరించాలి — అని నోర్మినహించారు. తల్లి — దండ్రులుపడే ఈ మానసిక క్షోభ శ్రీధర్ ఏమాత్రం అర్థం చేసుకోలేదు.

తాతగారు ఆస్తి పరాయివారికి వ్రాసి ఇస్తే — తండ్రి వూరకున్నారని, పినతండ్రులకు వేనకువేలు సహాయం పేరిట ఇవ్వటమేగాని, తిరిగి తీసుకోటం చేతకాదని, మేనత్త శిరీష్‌కు ఎమ్. బి. చెప్పించటానికి లేని ఇబ్బందులన్నీ — తన చదువనేసరికి వచ్చాయనీ — తండ్రిమీద అతడికెంతో కోపం; నలుగురిలో మంచివాడన్న పేరు తెచ్చుకోవాలన్న తండ్రి తపనే — తమనింత తక్కువస్థితికి తెచ్చిందనీ — తారతమ్యాలు — గౌరవాన్ని మరిచి తండ్రితో వాదనకు దిగేడు శ్రీధర్.

'ఏమైనా నేను ఎమ్. బి. చదవాల్సిందే... అత్తయ్యపాటి నేను చేయలేనా? ఆమె చదివేప్పుడులేని ఇబ్బందులన్నీ ఇప్పుడే వచ్చాయా? నేను కోరిన చదువు చెప్పించటం మీకంత ఇష్టంలేకపోతే,' పోనివ్వండి — నాదారి నేను చూచుకుంటాను మరి నా సంగతి మీ కొద్దు!' అన్నాడు చివరి అస్త్రంగా—

అతడి మాటలకు ఇందిరా — రమణా ఎంతో బాధపడ్డారు. అయినప్పటికీ, ఇంటికి పెద్దకొడుకుగా ఆ మాత్రం అడిగేహక్కు అతడికున్నదని సరిపెట్టుకుని, అతడి కోరిక మేరకు ఎమ్. బి. చదదివించటానికే సిద్ధమయ్యారు.

శిరి హౌస్‌సర్జన్ పూర్తి కావచ్చింది. శ్రీధర్ ఎమ్. బి.లో చేరేడు.

శ్రీధర్ చదువు నిమిత్తం నేనూ కొంత సహాయం చేయగలను, నువ్వు దిగులుపడకన్నయ్యా' అన్న శిరి నివారిస్తూ,

'అదేమిటమ్మా! ఆడపిల్లవు నీకు మేము ఇవ్వాలిగాని, నీదగ్గిర తీసుకోమన్నావా? అలాటి స్థితి వస్తే చూద్దాంలే— ఇప్పటికిమాత్రం ఏదో సర్దుకుపోగలంలే— ఇంకెప్పుడూ అలా అనకు' అన్నది నొచ్చుకుంటూ ఇందిర.

'అమ్మా శిరీ నీ మనస్సు నాకు తెలుసునమ్మా! నువ్వు ఒక ఇంటి దానివి అయితే— నాకెంతో మనశ్శాంతి కలుగుతుంది. నాన్నగారు నాకు అప్పగించిన బాధ్యత నెరవేర్చానన్న తృప్తి నాకు కలిగించు శిరీ, అదే నువ్వు నాకుచేసే సహాయం, డబ్బు దేమిటమ్మా ఇవాళ వస్తుంది, రేపు పోతుంది. మానసికమైన శాంతే గొప్పది. నువ్విలా ఒంటరి జీవితాన్ని గడుపుతూంటే నాకెప్పటికీ శాంతి వుండదు, అది తెల్సుకుంటె అంతే చాలునమ్మా.' అన్నాడు రమణ. అతడి మాటల్లో ఎంతో వేదన గోచరించి. ఆ రాత్రి శిరికి నిద్ర కరువైనది. ఇటీవల చదువు వ్యాపకంలోపడి రాజుని మరచినట్లే అనిపించింది. కానీ...పెళ్ళనే సరికి, మనస్సులో సన్నని పోటు ప్రారంభమైంది.

నిన్న విజయసారథి తన మనోభావం వెల్లడించినప్పుడే, తన మనస్సున పెను తుఫాను చెలరేగింది. అయినా పైకి తొణకలేదు. ఇన్ని సంవత్సరాలు విజయసారథితో పరిచయం, తనలో ఏవిధమైన అలజడి కలిగించలేదు. ఎంతో దగ్గిరగా మెలిగేవారు. రోగాల్ని గూర్చి చర్చించేటప్పుడు— ట్రీట్‌మెంటు విషయం వివరించే సమయాల్లో— అతడెంతో సభ్యతగా—తొందరపాటు కనపడకుండా ఓపిగ్గా తన కర్దమయే రీతిలో విశదపరిచేవాడు. రోగ నిర్ణయం చేయాలో—చక్కని సలహానిచ్చేవాడు. 'అంత మంచితనం మానవ మాత్రులకు సాధ్యమా' అనుకునేది అప్పుడప్పుడు. సహృదయుడైన మంచి మిత్రుడుగా భావించి, అనేక విషయాలు ఎంతో ఫ్రీగా చెప్పేది. అసలు అతడి సహకారమే లేకపోతే తనీ చదువులో నిలదొక్కుకునేది కాదు కూడ. తనింత ముందుకు వచ్చి మెడిసిన్‌లో ప్రావీణ్యం సంపాదించటానికి అతడే కారణం, ఆ సంగతి తనకు తెల్సును— మనస్సు నిండుకూ అతడిపట్ల తనకు కృతజ్ఞతా భావం వున్నది. అంతకు తప్ప మరో భావానికి తనలో తావులేదు. కానీ...ఇంత సరళమైన స్నేహభావాన్ని చూపిన విజయసారథిలో ఇలాటి వూహలున్నాయంటే నమ్మశక్యం కావటం లేదు. ఆ మాటవింటూనే మ్రాన్పడి పోయింది. తరువాత బాధ పడింది. ఈ కారణంగా



తను స్నేహం పేరి కోసటం తన కిష్టం లేదు—అందుకే అతడి ప్రతిపాదన ఆమోదించనూ లేక — తిరస్కరించనూ లేక — కల్లోలితంగా అయిన మనస్సును అదుపులో పెట్టుకుంటూ.

'నాకు కొంచెం టైమివ్వండి విజయ సారధిగారూ', అని లేచి వచ్చేసింది. ఇప్పుడు అన్నగారు కూడా తన పెళ్ళి ప్రస్తావన తేవటం—ఆమెకు మరింత బాధగా - విసుగ్గా వున్నది. ఎక్కడికన్నా వీళ్ళ నుండి దూరంగా పారిపోతే బావుండునన్న ఉద్వేగం కలుగుతోంది. 'ఎక్కడికెళ్ళితే మాత్రం ఏం లాభం— ఈ మనుష్యులే ఈ పరిస్థితులే ప్రతిచోటా వుంటాయి—వీటి నుంచి తను పారిపోలేదు.' ఆ భావమే ఆమెను కట్టిపడేసింది. రాజా మీద ప్రేమ ఏనాడో నశించి పోయింది. కానీ – అతడు చేసిన వంచన—మనస్సు మీద తేరుకోలేని దెబ్బ గొట్టి—పెళ్ళంటేనే అసహ్యం — మగవారి పట్ల—క్రోధం – కసి పేరుకుపోయినయ్యి—తన మనుగడకు మగవారి ఆధారం లేక జరుగదన్న భయంలేదు. అందుకని జీవితమంతా ఒంటరిగానే నిర్ణయం చేసుకున్నది. కానీ తన నిర్ణయాలకన్న పరిస్థితుల ప్రాబల్యం ఎక్కువని తెలుసుకున్నదిప్పుడు. తనకు జీవించటమే దుర్భరమనుకున్న క్షణాలలో–తన మనస్సున పేరుకున్న నైరాశ్యాన్ని తొలగించి, బ్రతుకు మీద ఆశను రగిలించి—మనిషిగా నిలబెట్టి—తన అభివృద్ధికెంతో దోహదంచేసి–కన్నకూతురుకన్నా ఎక్కువ అభిమానంగా చూచుకుని, తన శ్రేయస్సును కాంక్షించే—అన్నా, వదినలకు తనవలన అశాంతి కలగటం తను సహించలేదు. వారివట్ల తను చూపించే కృతజ్ఞత అది కాదు. తను మానసికంగా చితహింసకు గురైనా—తనవారి మాటకు కట్టుబడక తప్పదు. అదే తన ధర్మం... కానీ...కానీ...ఎలా?... తన మనస్సు ఎదురు తిరుగుతుంది. అసలా భావమే జుగుప్స కలిగించి, తనలో నరనరము అసహ్యంతో ముడుచుకుపోతుంది. కానీ — తప్పదు... తప్పదు. దేవుడులాంటి తన అన్నగార్ని సంతోష పెట్టటంకొరకు తనీ బాధ సహించి తీరాలి—అవును...అంతే...ఆ రాత్రి ఆమెకు శివరాత్రే అయింది.

మరునాడు హాస్పటల్‌కు వెళ్ళలేదు.

# చరితార్థులు

గత్యంతరంలేక నాలుగవరోజు వెళ్ళింది. తను హవుస్‌సర్జన్ చేసే హాస్పటల్‌లోనే విజయసారధి–అసిస్టెంట్ సర్జను. అతణ్ణి తప్పించుకునే మార్గం లేదు. అతను అడిగినదానికి తనవద్ద సమాధానం లేదు. తననిలాటి చిక్కుల్లో ఇరికించి, సమస్యల విషవలయాల్లో చుట్టుకుపోయి బిజ బిజ తన్నుకునేటట్టు పరిస్థితులు కల్పించిన రాజా మీద అంతులేని క్రోధంగా వున్నది. కసి పిస్తే ఖూనీచేసి కసి తీర్చుకోవాలన్నంత ప్రతీకారేచ్ఛ అగ్నిలాగా రగిలి అశాంతితో మనస్సుడికిపోయి—అల్లకల్లోలమై పోయింది. పదిలంఖణాలు చేసినట్లుగా వొంట్లో శక్తి వుడిగిపోయి నీరసం ఆవహించింది. కానీ... ఏలాంటి స్థితిలోనైనా సరే—హాస్పటల్‌లో అడుగుపెట్టేసరికి – భరించలేని బాధలతో దీనంగా విలపించే—ఆ రోగార్తుల మధ్య—ఆమె తన మానసికమైన బాధలు మరిచి—రోగుల సేవలో యోగినిగా మారిపోయేది. బాధతో విల విల్లాడిపోయేవారికి వూరట కలిగిస్తూ — అధైర్యపడినవారికి ధైర్యాన్ని కలిగిస్తూ, తనకు సీనియర్సు — అనుభవజ్ఞులు అయిన డాక్టర్ల సలహామేరకు—జాగ్రత్తగా, నిమిషం ఏమరకుండా రోగులకు ట్రీట్‌మెంట్ చేస్తూ—వార్డులో తిరగటమే ఆమె కెంతో శాంతిగా — ఆనంద దాయ

## బంగాళ దుంప కేకులు

| కావలసినవి — | కొలత |
|---|---|
| ఉడకబెట్టిన బంగాళ | |
| దుంపలు | — 100 గ్రా |
| పిండి | — 30 గ్రా |
| వెన్న | — 15 గ్రా |
| ఉప్పు | —రుచికి కావలసినంత |

బంగాళదుంపలు బాగా పొడిచేయాలి. దానికి పిండి, ఉప్పు వెన్న కలపాలి. అంగుళం దళసరిన ఒత్తి ముక్కలుగా కోయాలి. నూనెరాసిన పెనం మీద కాల్చి వేడివేడిగా వడ్డించాలి. వీటిపైన వెన్న రాయవచ్చును.

—కూ. రా.

కంగా వుండేది. అందుకే ఇవాళా–రెండు మూడు రోజులుగా తనువడ్డ తీవ్రమైన వేదన మరిచి — వీటన్నిటికీ అతీతురాలుగా —తన కార్యక్రమాల్లో నిమగ్నురాలు అయింది శిరీష్.

ఒకటి రెండుసార్లు ఆమె డ్యూటీ చేస్తున్న వార్డులోకి విజయసారధి వచ్చాడు గానీ...ఎమర్జెన్సీ డెలివరీకేసు అటెండ్ అయిన శిరీష్‌ను కలిసే అవకాశం అతడికి వీలుకాకనో—ఆమెకు తీరిక లేకనో—ఒకరి నొకరు కల్సుకునే అవకాశం రాలేదు.

ఆరోజు శిరీష్‌కు ఆఫ్‌డే — మధ్యాహ్నం రెండుగంటలకు డ్యూటీ పూర్తిచేసుకుని ఇంటికి వెళ్ళబోతున్నది, హాస్పటల్ గేటు దగ్గిర సారధి ఎదురై విష్ చేసేడు చిన్నగా నవ్వుతూ—

'అరే ఇదేమిటిలా ప్రత్యక్షమైనారు' ఆశ్చర్యంతోపాటు, భయమూ వేసిందామెకు.

'మరే గేటుకీపరు డ్యూటీ పుచ్చుకున్నానీవేళ' చిలిపిగా నవ్వుతూ.

'అదృష్టమే! వచ్చేటప్పుడు, వెళ్ళేటప్పుడు, తను దర్శన భాగ్యం కలుగుతుంది' అతడికేమీ తీసిపోకుండా అన్నదామె చిన్నగా నవ్వుతూ.

'అంతేకాదు, అనుక్షణం ఆ భాగ్యం కలగాలనే ఈ ప్రయత్నం'

ఆ మాటకామె చిరునవ్వు చెదిరిపోయి మౌనం దాల్చింది.

అతడు చిలిపితనాన్ని కట్టిపెట్టి, సీరియస్‌గా—

'ఏం చేయమన్నావు–శిరీష్ రాణీ — నువ్విలా తప్పించుకు తిరుగుతుంటే గత్యంతరం లేక ఇవాళ శలవుపెట్టి–నీకు ఆఫ్ అని తెలిసి నీకోసం చూస్తున్నాను. పద అలా ఏదన్నా రెస్టారెంటులో కాఫీ తీసుకుందాం' అతడలా అంటూంటే తప్పించుకునే వీలులేక, అతడి వెనుకే నడిచిందామె.

'ఏం తీసుకుందాం' కుర్చీలో కూర్చుంటూ అన్నాడు సారధి.

'ఏమీ వద్దు—కాఫీ చాలు'

'అబ్బో బెట్టు చేస్తున్నావే ఇవాళ కొత్తగా, సరే నాకిష్టమైనవన్నీ ఇవాళ నీచేత తినిపిస్తాను చూడు' ఎప్పటి స్నేహాన్ని కనపర్చుతూ చనవుగా అని—

# వెంకటరాఘవన్ కి ప్రియమైన కాఫీ:

## నెస్‌కాఫే!



"ఉత్తేజ భరితమయిన టెస్టు ఆఖరున ఒక కప్పు వేడి వేడి నెస్‌కాఫే విలువ తెలుస్తుంది. అలసట తీరాలంటే దానితోనే."

అతనికి తెలుసు కాఫీకి అలవ-డినవారికి తెలిసినట్టు. ఇతర ఇన్‌స్టంట్ కాఫీలన్నిటికన్న నెస్‌కాఫే విశిష్టమని. దానిని ప్రత్యేకం తనవంటి కాఫీ కాముకులకోసం తయారు చేశారని అత్యుత్తమమయి 100% పరిశుద్ధమయిన దక్షిణాది కాఫీ గింజలతో.




**నెస్‌కాఫే**

**నెస్‌కాఫే ఎక్కువ ప్రియమైనవారికి అత్యంత ప్రియమైనది**

ACIL-90(1) 233 TEL

మోడు బారి పోయిన జీవితానికి అర్థం వేశావు.

అవి అంటూ హాస్పటల్ విషయాలు మాట్లాడుకుంటూ — కొంత సేపక్కడే కూర్చున్నారు.

'అరే నాలుగైందే అప్పుడే. ఇక నేను వెళ్తాను' వాచీ చూసుకుంటూ లేచింది శిరీష్. అతడూ లేచి వచ్చి — టాక్సీ పిల్చాడు. డోర్ తెరిచి పట్టుకున్న అతడి వేపు విస్మయంగా చూసి — లోపల కూర్చున్నది. సారధి ఆమె పక్కన కూర్చుంటూ — 'బీచికి పోనివ్వు' అన్నాడు.

# చరితార్థులు

ఆమె తడబాటుగా వద్దు...వద్దు అన్నది.

'నీతో చాలా మాట్లాడాలి...ప్లీజ్... వద్దనకు, ఈ అవకాశం కొరకు చాలా రోజులుగా ఎదురు చూస్తున్నాను' ప్రతిమాటలో ధ్వనిలో అతడంటూ వుంటే ఆమె కాదన లేక పోయింది.

సముద్రానికి దూరంగా ఇసికలో ఇద్దరూ కూర్చున్నారు. ఇద్దరి మధ్యా మౌనం...ఆమె దూరంగా ఆడుకుంటున్న పిల్లలకేసి, మరుగు చిమ్ముతూ వచ్చి నాట్యానికొట్టుకుని చెదిరిపోయే కెరటాల కేసి చూస్తోంది.

'శిరీష్, నీకు టైము కావాలన్నావు! పదిరోజులైంది, ఏమాలోచించావు?'

అతడు ఆమె మోములోకి పరిశీలనగా చూస్తూ అన్నాడు.

'ఏమో, నాకు తెలీదు' నిర్లిప్తంగా అన్నదామె.

'అలా అంటే కుదరదు. నాకు సరైన సమాధానం కావాలి! మీ కిష్టమైతే సరా; నాకు కావద్దా?' అంటావేమో. అదీ నిజమే! అందుకే—ఇదీ నా ఉద్దేశ్యం-నీవే మంటావని ఇంతగా అడుగుతున్నాను. నా ప్రతిపాదనని నీవు బలపరుస్తావనే నమ్మకంతో వున్నాను. కాని నీ నిరాకరణకు కారణం చెప్పు—నీ మనస్సున ఎవరైనా వుంటే నేను అడ్డు రాను.'

'లేదు—లేదు' ఆమె కంగారుగా అన్నది.

అతడు తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు. ఆమెకు మరింత చేరువకు జరిగి—

'అయితే ఏమిటి అభ్యంతరం — చెప్పు శిరీష్, నాకు ప్రేమ పాఠాలు వల్లించటం రాదు. కవిని గాదు—గాయకుణ్ణి అంతకన్నా కాదు. అతి సామాన్యుణ్ణి — మామూలు మాటల్లోనే—నా మనస్సు నీ ముందు వుంచుతున్నాను. అర్థం చేసుకుంటావు కదూ!

నిన్ను చూసిన మొదటిరోజున-నిజంగా నాలో స్నేహభావమే తప్ప మరో భావం లేనేలేదు. క్రమంగా మన మధ్య స్నేహం బలపడి సాన్నిహిత్యం పెరిగేక, స్నిగ్ధ సుకుమారమైన నీ స్వభావం—వడవడిక — నన్ను అమితంగా ఆకర్షించింది. నిన్ను నా జీవిత భాగస్వామినిగా చేసుకోవాలన్నకోరిక పొటమరించింది. అప్పుడే నా కోరిక నీ ముందు వెల్లడించాలని ఆరాటం కలిగినా — అది మన భవిష్యత్తుకు మంచిదికాదని—మన చదువులయ్యేదాకా ఆ ప్రసక్తి నీ ముందు తేకూడదని — బలవంతాన నిగ్రహించుకున్నాను. అయిదు సంవత్సరాలుగా ఈ శుభ కాలంకొరకు వేచియున్నాను. నిన్ను చూస్తే ...మన మధ్య జన్మ జన్మల అనుబంధమేదో వున్నదని—నీ కోసమే వున్నాననీ నా మనస్సు నిరీక్షిస్తోందనీ—ఏనాడో దూరమైన ఆప్తురాలు దగ్గరైనట్లుగా—అవ్యక్తమైన భావనాలహరి మనస్సున పొంగులెత్తి—

## 'నాకు కట్నం తీసుకువెళ్లాలని వుంది'

'భార్యాభర్తలు ఇద్దరూ పనిచేస్తే సుఖముండదు. పనిపాట్లు చేసుకుని ఇంటికి వచ్చిన వాళ్లకి శాంతివుండదు. ఇంటి పనులు చూసు కోవడంలోనే ఆడపిల్లకి ఆనందం'అన్నది గుంటమడుగు శోభ. ప్రెసిడెన్సీలో ఎమ్మే (తెలుగు) ఫైనలియర్‌లో వున్నది.

శోభకి ఫస్ట్ ప్రిఫరెన్స్ పెళ్లి. కాకపోతేనే ఉద్యోగం.

పెళ్లయేవరకు టైమ్ పాస్ చెయ్యాలి గనక చదువు కుంటున్నదట.

కోఎడ్యుకేషన్ వల్ల మగపిల్లల్లో పెకిలి వేషాలు తగ్గిపోతాయి అంటుంది శోభ.

సినిమాలు ఎక్కువగానే చూస్తుంది.

'అతరం నాగేశ్వరరావు ఈతరం శోభన్ బాబు అంటే నాకు ఇష్టం' అంది. శారద ఈమె అభిమాన నటి.

హిందీలో రాజేష్‌ఖన్నా జయభాదురి అంటే ఇష్టం. ఈమధ్యన వచ్చినచిత్రాల్లో 'విచిత్రబంధం' నచ్చిందట.

శోభకి కథలు రాయడం, ఉత్తరాలు రాయడం అంటే సరదా. అభిమాన రచయిత్రి యద్దన పూడి సులోచనారాణి.

'అడల్ట్స్ సినిమాలంటేనే చిన్నపిల్లలు ఎగబడతారు. అలా'ఏ' సర్టిఫికేట్ ఇవ్వకుండా వుంటేనే మంచిది—అని శోభ అభిప్రాయం.

'ఆడపిల్ల నిండుగా అడర్శగృహిణిగా కని పిస్తేనే బావుంటుంది' అనేది ఫాషన్స్‌మీద ఈమె అభిప్రాయం.

'లవ్ మారేజి చేసుకోవచ్చు. కాని అది తల్లిదండ్రుల్ని కష్టపెట్టేదిగా వుండకూడదు' అనే శోభకి కట్నం తీసుకు వెళ్లాలని వుందట! 'మగపిల్లలకి ఎలాగూ ఇస్తున్నది. మనం కూడా ఇలా తీసుకు వెళ్తేనే బాగుంటుంది' —అంటుంది.



గుంటమడుగు శోభ.

బావిసలు కానంతవరకు తాగుడు, సిగరెట్టు ఫరవాలేదు అంటుంది శోభ. చదువు పూర్తయే వరకు పెళ్లి కాకపోతే ఇంగ్లీషు లిటరేచర్ చదువు తుందట. ఆతర్వాత ఏ లెక్చరరుగానో పని చేస్తుందట!

—వీరరాజా

మమతా మాధుర్యతతో నింపివేసింది. నిన్ను తల్చుకుంటూ తీయటి కలలు కన్నాను. అనుక్షణమూ నీవు నా పక్కన వుండాలి. నా కర్తవ్యాన్ని నిర్దేశించాలి — నా జీవన పథంలో సహచరివై — తోడునీడవై — కష్ట సుఖాల్ని పంచుకునే నెచ్చెలివై — సదా నా వెన్నంటి వుండాలి — నీవు లేక ఒంటరి జీవితాన్ని గడపటం నా వూహకే అందని విషయం — ప్రేమ వేరు — పెళ్ళి వేరు అను కునే మూర్ఖుణ్ణి కాదు. పెళ్ళితోనే నా ప్రేమ పరిపూర్ణంగా ఫలించాలి — శిరీష్ నన్ను అర్థం చేసుకో — మన పెళ్ళికి అభ్యంతరమేమిటో నాకు చెప్పు — ఆనాళ అంత విరసంగా నీవు నా మాట వినకుండా లేచి వెళిపోతే — నేను ఎంత చిత్రహింస అనుభవించానో మాటల్లో చెప్పలేను. ఇంక నన్నిలా బాధించకు. ప్లీజ్ - నీవు ఆమోదిస్తే — మీ వాళ్ళతో మాట్లాడి ఒప్పించే బాధ్యత నాది. నీ చిన్నారి పెదాలు విప్పి ఒక్క మాట చెప్పు శిరీష్ - అది ఏదైనా నిండు మనస్సుతో స్వీకరిస్తాను.' ఆర్ద్రమైన కంఠంతో, గుండెల్లో అనురాగమంతా మాటల్లో పొదిగి అతడంత ప్రాధేయతగా అడుగుతూంటే — ఆమె విచలితురాలైంది.

అతడికెలా చెప్పగలదు? తన సమాధానం విని అతడు భరించగలడా? భగవాన్ ఏమిటీ పరీక్ష? ఏలా అతడికి చెప్పటం. తను మళ్ళీ ఇలాటి చిక్కుల్లో ఇరుక్కోకూడదను కున్నది. తన ప్రయత్నంలేకనే ఇలా జరిగింది.

అందుకు తన బాధ్యత లేశమాత్రం లేదు. అతడిమీద అసహ్యమూ లేదు అభిమానమూ లేదు — అయినా అంతగా ప్రాధేయపడి అడుగుతూంటే — నిరాకరించలేక — ఆమోదించనూలేక — మనస్సు బాధా పహమై పోతూంది. మాటలేరాని మూగదానిలా — నిరామయంగా చూస్తూ, తన్నుతానే మరిచి స్తబ్ధురాలైంది.

ఆమె మౌనం అతను భరించలేకపోతున్నాడు. ఎంతకీ జవాబు చెప్పని ఆమెమీద అతడికి కోపంరాలేదు సరికదా — మరింత మృదువుగా ఆమెచేయి తన చేతుల్లోకి తీసుకుని,

'శిరీష్, ఎందుకింత బాధ పడ్తావు? నీ మౌనం నా మనస్సు నెంత కాల్చి వేస్తున్నదో నీకు తెలీదు — అవును — కాదు అన్నమాట ఒక్కటే చెప్పు ఎన్నింక అడుగను, ఒక్కమాట చెప్పటానికి ఎందుకింత జాప్యంచేస్తావు? మాటాడు శిరీష్' అతడు జాలిగా అంటూంటే, ఆమెకు దుఃఖం ముంచెత్తింది. ఎలాగో గొంతు పెగుల్చుకుని,

'నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు సారధిగారూ ఇంక నన్నేమీ అడుగవద్దు' అంటూ కళ్ళుమూసుకున్నదీ.

ఆ జవాబు అతడికి తృప్తి కలిగించలేదు.

'అదే ఎందుకిష్టం లేదో చెప్పు — ఇన్నాళ్ళు కలిసితిరిగేము — ఒకరి గురించి ఒకరికి బాగాతెల్సు — పోనీ — నా అభిరుచులు — వడవడి నీకు నచ్చకపోతే నిర్బంధించను — కాని సరైన కారణం నాకు కావాలి. నీ ఆప్తుడుగా — స్నేహితుడా భావించి — నీ బాధ ఏమిటో నాకుచెప్పు. ఏ పరిస్థితులు నిన్ను పెళ్ళికి విముఖురాల్ని చేశాయో చెప్పు — మనస్సున బాధ ఆప్తులతో పంచుకుంటే కొంతసేద తీరుతుంది — స్నేహితుడుగా నీ బాధ కొంచెమన్నా ఉపశమింప చేయగలనేమో ప్రయత్నిస్తాను — చెప్పమ్మ శిరీష్' మునివేళ్ళతో ఆమె చుబుకాన్ని ఎత్తి లాలిస్తూ అడిగేసరికి — ఆమె కన్నీరు కట్టలు తెంచుకున్నది. చేతుల్లో ముఖం దాచుకొని వెక్కివెక్కి ఏడ్వసాగింది.

కొంత సేపటికి కాస్త తేరుకుని.

రాజతో తన పరిచయం — ప్రేమ — పర్యవసానం — ముగింపు — తన ఆత్మహత్యా ప్రయత్న విఫలమవడం, బి.ఎస్. సి. చదువుకై వదినగారి ప్రోద్బలము, ఇప్పటి తన మనస్థితి — అంతా — ఒక్కటి వదలకుండా చెప్పి. ఇప్పుడు చెప్పండి సారధీ — ఏ నాడో ఒకరికి అంకితమై — నిరాకరించబడి — శూన్యమైన నా మనస్సు మీరు స్వీకరించగలరా? అలా నేను కోరగలనా? అంతే కాదు సారధిగారూ — కోలుకోలేనంతగా నా మనస్సు దెబ్బతిని దుగవారిపట్ల ద్వేషము — అపనమ్మకము నాలో పాతుకుపోయింది. పెళ్ళంటేనే ఒక విధమైన విరాసక్తత ఏర్పడింది. రాజా నా మనస్సునుండి ఏనాడో జారిపోయాడు — ఇప్పుడతని ఛాయలైనా లేవు, అయినా మరొకర్ని నా మనస్సున నిలుపుకుని — జీవితంలోకి ఆహ్వానించే శక్తి నాకు లేదు. రోగుల సేవలోనే మనశ్శాంతి వెతుక్కుంటూ — ఇలా బ్రతుకు వెళ్ళమార్చుకుంటే చాలునన్నదే నా ధ్యేయం. ఇంక ఏ బంధాలు తగిలించు



# చరితార్థులు

కోలేను. నన్ను క్షమించి మర్చిపోయి మీ జీవితాన్ని మరొకరిద్వారా సుఖవంతం చేసుకోండి సారథీ — స్నేహితురాలుగా — హితైషిగా ఇది నా సలహాకూడాను, నా మీద కోపగించకండి — ఎప్పటికీ మనం మిత్రులం గానే వుందాము' ఇంకా ఏమో అంటున్న ఆమె మాటలు అతడు వింటున్నట్లులేదు —

ఆశ్చర్యంతో — వేదనతో — అతడి భ్రుకుటి ముడిపడింది. దూరంగా దిగంతాల వేపు దృష్టి సారించి పరధ్యానంలో పడిపోయాడు.

అతడి వాలకం చూసిన ఆమెకు ఆశ్చర్యం కలుగలేదు; తన సంగతి విన్న తరువాత అతడలా మారటం సహజమే, బహుశా నిట్టూర్చి, అతణ్ని పలకరించే సాహసం లేక మౌనం వహించింది. అలా ఎంతోసేపు ఎవరి ఆలోచనల్లో వారున్నారు. అప్పటికే వలువైపులా చీకట్లు కమ్ముకున్నీ బీచిలో జనం పల్చబడసాగారు.

'సారథిగారు మిమ్మిలా బాధించినందుకు నన్ను మన్నించండి. చాల ఆలస్యమైంది ఇంక లేద్దాము' దీనంగా పలికే ఆమె మాటలకు వులిక్కిపడి, ధ్యానముద్రలోంచి బైటపడ్డట్టు — వింతగా ఆమెవంక చూశాడు. ఆ చూపులు ఆమె గుండెల్లో, చొచ్చుకుపోయి శోధిస్తున్నాయి. ఆనాడే ఆమెను చూస్తున్నట్టు కొత్తగా, ఆశ్చర్యంగా—అభిమానంగా, జాలిగా, పెల్లుబికే ప్రేమతో, రకరకాలుగా మారిన ఆ చూపులు, నిశ్చలంగా ఆమె ముఖంమీద నిల్చిపోయాయి. జాలిగా — బేలగా — స్నిగ్ధ సుకుమారంగా వున్న ఆమె మోము — అతడి హృదయంలో—సున్నితము—సుమధురము అయిన భావ సంచలనాన్ని కలిగించింది. నిగ్రహించుకోజాలని మహా వుద్వేగంతో — అనురాగ మనస్కుడై — ఒక్క వుదుటున ఆమెను బలంగా దగ్గిరకులాగి గుండెల కదుముకున్నాడు.

ఈ హఠాత్ సంఘటన వూహించని శిరీష్ బెదిరిపోయి అతడి చేతుల్ని వదిలించుకోలేక వుక్కిరిబిక్కిరై — అతని కౌగిట్లో వొదిగిపోయింది.

'శిరీష్, నీ మనస్సున ఇంత బాధాగ్ని దాగి వున్నదని నేను వూహించలేదు. నీ మనస్సు నొప్పించినందుకు క్షమించు. సుమ కోమలమైన నీ హృదయాన్ని ఇంతగా బాధించిన ఆ దుర్మార్గుడెవరు? చెప్పు శిరీష్ — ఇప్పుడే షూట్‌చేసి పారేస్తాను. ఆడదాని జీవితంతో చెలగాటమాడే అలాటి రాస్కెల్స్‌ను ఏంచేసినా పాపంలేదు. అలాటి ధూర్తులవలెనే — మగవారందరూ అలాటివారేనన్న అపవాదు కలుగుతోంది. నా శిరీ ఇంక నిన్ను బాధ పడనీయను. నీ మనస్సున తగిలిన గాయానికి — నా అనురాగమనే మందు వేసి మాన్పగలననే ధైర్యం నాకున్నది. మగవారందరూ — వంచకులేకాదు, ప్రేమించే హృదయం వారికీ వుంటుంది. ఒక్కసారి నా గుండెల్లోకి చూడు—అంతటా నీరూపే గోచరిస్తుంది. నాలో నీ రూపు స్థిరంగా ముద్రపడింది. దాన్ని తొలగించడం దేవుడి తరంకూడా కాదు. నా మాట నమ్ము శిరీ. అలా భయంగా చూడకు. నేను నీ స్నేహితుణ్ని — ఆప్తుణ్ని — అతడెవరో వంచన చేశాడని, నీ జీవితం అడవిగాచిన వెన్నెల చేసుకోటం వివేకంకాదు. నీవు నాఅర్ధాంగివై —నా జీవితాన్ని పంచుకోవాలి—జీవన గమనంలో ఎదురయే—సుఖ–దుఃఖాలు భరించే శక్తి నివ్వాలి నాకు. ఏం శిరీ — నమ్మతమేకదూ?'

'మీరు చెప్పింది నిజమే కావచ్చును సారథిగారూ—కానీ—నామనశ్శరీరాలు ముడుచుకుపోతూ — నాలో అలాటి వూహలకే తావివ్వదు—ఇందులో నేను అశక్తురాల్ని— నన్ను నిర్బంధించకండి ప్లీజ్' ఆమె కళ్లు అశ్రుపూరితమైనాయి.

'శిరీ నా మాట విను. స్త్రీకి అయినా— పురుషుడికైనా వివాహంతోనే జీవితం పరిపూర్ణమవుతుంది. ఒంటరిగా గడిపే జీవితాలకు శాంతి ఎప్పటికీ లభించదు. మరోమాట, స్త్రీగా నువ్వు నన్ను సుఖపెట్టకపోయినా ఫర్లేదు — పుత్రాలగా — సదా నాచెంతనుంటే చాలు — అదే నేను కోరేది. కలిసి బ్రతకాలంటే — వివాహమనే సాంఘికముద్ర పడాలి — లేకపోతే ఎదురయే — అపవాదుల్ని ఎదుర్కోలేక ఇద్దరి జీవితాలు కృంగి కృశించిపోతాయి. కాబట్టి నా కోరిక మన్నించు ఎలాటిస్థితిలోనూ నిన్ను నిర్బంధించను. నీ మనస్సును వ్యతిరేకించను; ఈ పంచభూతాల — గభీర సాగరం — నీలాలనింగిసాక్షిగా నీకు వాగ్దానం చేస్తున్నాను, నీ అంతట నీవు దరిచేరే వరకు నేను నిరీక్షించగలను. నా ప్రేమ నాకా నమ్మకాన్ని కలిగిస్తోంది!!' ఆవేశంతో అతడి కంఠం వణికింది.

అతడి మాటలకామె విభ్రాంతురాలైంది. క్షణం మనస్సు రెపరెపలాడింది. అయినా రాజస్థానంలో సారధిని నిలపటాని అశక్తురాలైంది.

'సారధిగారు మీ వున్నతమైన ప్రేమకు నేను అర్హురాల్నిగాదు. ఎందుకు అమూల్యమై మీ అనురాగాన్ని వృధా పర్చుకుంటారు. నామాట మన్నించి మీ పట్టుదల వదలండి' కాతర స్వరంతో తలవొంచుకు నేలచూపులు చూస్తూ అన్నది.

'అర్హతా — అర్హతలు ఏమిటో నాకు తెల్సును, నిజమైన ప్రేమ ఎప్పటికీ వృధాకాదు. ఇంక అడ్డు చెప్పకు.' అతడి పట్టుదలకు నివ్వెరపోయింది — జవాబు చెప్పలేక నిస్సహాయంగా నీరునిండిన కళ్ళు వత్తుకుంటూ —

'రేపు కలుద్దాం పదండి — చాలా చీకటైంది, మా వదిన ఎదురు చూస్తుంటుంది' అని మరో మాటకు అవకాశం ఇవ్వకుండా లేచి అడుగులు ముందుకు వేసింది.

'నా మాటకు జవాబు ఇవ్వలేదు' చేయిపట్టుకుని నిలవేస్తూ అన్నాడు.

ఇప్పుడు కాదు — రేపు చూద్దాం చేయి విడుపించుకుని నడవసాగింది. చిన్నబోయిన మొహంతో ఆమెను అనుసరించాడు విజయసారధి.

(ఇంకా ఉంది)




‘వావరాకడ, ప్రాణం పోకడ ఎవరు చెప్పగలరు ?... నాకేమో ,భయంగానే వుంది బాబూ !...’ భీతావహ నేత్రాలతో వింగివైపు చూస్తూ అన్నది శశిరేఖ.

భోజనానంతరం ఇంటివాకిట పట్టె మంచంమీద కూర్చుని, హృదయేశ్వరి అందించిన తమలపాకు విడెం నోట తురుము కుంటూ ‘ఆఁ ..నేలమీదికి వూడిపడే వాన కాదులే యిది. కొమ్మపై కూర్చుని కుర్రు మనే కొండకోతిలా—ఆకాశంలో మకాం పెట్టి, అక్కణ్ణుంచే హడలగొడుతూ వుంటుంది. అయినా—రేపూ మాపూ వచ్చే ప్రమాదం ఏమీ లేదులే ! ..’ అన్నాడు సుధాకరం, తొణుకూ బెణుకూ లేకుండా.

‘మాయదారి వాన ! ఇంతలోనే కొంప మీదికి దండయాత్రకు బయల్దేరకపోతే— కొంప కప్పేంతవరకూ ఆగరాదూ ?...’ శశిరేఖ చిరాకుపడటం చూసి సుధాకరం సన్నగా నవ్వుకున్నాడు.

నూతన దాంపత్యం ! వివాహ మహోత్సవంనాడు తమ చెంపల్ని అంటుకున్న సుగంధ పరిమళం, తలమీది తలంబ్రాలు, అంతరంగంలో అంకురించిన మధుర వాంఛలు యివన్నీ ఈ శరీరాలనింకా అంటి పెట్టుకునే వున్నాయనిపిస్తోంది. శృంగారాలతో ఈ రేయిని బంగారంగా పండించుకోవలసిన శశిరేఖ — పిండివంట తయారు కావటానికి వలసిన సామగ్రులన్నీ వుండి కూడా ఆ వంటకం మీద ఇష్టంలేని దురదృష్టవంతురాలిలా—మిన్నకున్నది. వేడి గాలి సోకి పలుచపలుచనై చెదరిపోయే మేఘ మాలలా ఆమె హృదయం విశృంలతను కోల్పోయి వుండటాన్ని సుధాకరం గ్రహించాడు.

ఆలోచనా మగ్నుడైవున్న సుధాకరం మెడపైకెత్తి ఆకాశపు లోతుల్లోకి దృష్టి సారించాడు. సంకేతస్థలం చేరి ప్రియాగమనంకోసం నిరీక్షించే ముద్దరాలికి– తన ప్రియుడికి మారుగా కామాంధకారంతో

కేలుజాపుతూ కిరాతుడొకడు కనిపిస్తే ఆమె ముఖం ఏరంగుల్ని దిద్దుకుంటుందో అతడు ఊహించగలిగాడు. గగనసీమలో శశాంకునికి మారుగా మందగమనంతో కదిలి వస్తూన్న వల్లమబ్బుల చాటున కళలుడిగిన ముఖాలతో చుక్కలు వెలవెల పోతున్నాయి.

'శశీ ! అటు చూడు...' అన్నాడు సుధాకరం అంబరంవైపు వేలెట్టి చూపి. శశిరేఖ అటు చూచింది.

'అదిగో ! కనిపిస్తోందా ? ఆ చుక్క...'

'కనిపిస్తోంది...వానమబ్బు' అంది శశి.

'...ఆ వానమబ్బు కవతల మినుకు మినుకు మంటూన్న ఆ చుక్కను చూడు. అది అచ్చం నీలాగే వుందిసుమా !'

శశిరేఖ నవ్వింది.

'అయినా నీయంత చక్కగా నవ్వడం ఆ చుక్కకు చేతగాదు. చూడు, దాన్ని ఆ వానమబ్బు కప్పేసింది. శశీ ! ఆ వాన మబ్బులాగా నిన్నూ ఏదోభయం కప్పేసింది ఈ రాత్రికి మాత్రం—ప్లీజ్ – దాన్ని దూరంగా తరిమెయ్. తెల్లవారగానే—యిల్లు కప్పేయించకపోతే నాపేరు శశిరేఖ మొగుడేకాదు...'

శశిరేఖ సిగ్గును, చిరునవ్వును చిందించబోయి, ఆ పని మానుకుని చిరుకోపంతో మరో ఆకుచిలకను ఆతనినోటిలోకి దోపింది.

'అయినా, ఇప్పుడంత భయందేనికి ? .. వానలో తడిస్తేమాత్రం — రాబోయే ప్రమాదం ఏముంది ? నీకు తెలుసో తెలియదోగానీ, భార్యాభర్తలు చెట్టాపట్టా లేసుకుని వానలో తడిస్తే పండంటి కొడుకు పుడతాట్ట ! .. కాబట్టి అంతా మనమేలు కొరకే !'

ఆమె అతనివైపు కొంటెగా చూచింది. అతడు నిజంగా సుధాకరుడే ! అతని చూపులోనూ, చిరునవ్వులోనూ, పలుకులోనూ, పరిహాసంలోనూ ఒలికేవి వెన్నెలలే! అతని సన్నిధి ఒక వెన్నెలవాన ! తాను ఆ వెన్నెలవానలో జలకాలాడే తారక ! కానీ, ఆ పరిసరాలు ? .. దాన్ని దేనితో పోల్చాలి? మేఘావృతమైన ఆకాశం అంటే సరిపోతుందేమో !

శశిరేఖ ఒక్క వీక్షణంతో ఆ పరిసరాలన్నిటినీ అవలోకించింది. తమ నివాసగృహం — ఒకపూరిల్లు. ఆ యింటికప్పు చిరకాలంగా వానకు తడిసి, ఎండకు మాడి, క్రుగ్గిపోయి, చివరకు చెదలపాలబడిపోయింది. ఆ యింటిలోపల కూర్చుని వింగి నడిబొడ్డున ఎగిరే విమానాన్ని స్పష్టంగా చూడవచ్చు. ఇంటిప్రక్కన చేదబావి. దాని కట్టుప్రక్క — ఒకదానిమీదొకటి పేర్చివున్న పూరిగడ్డిమోపులు. ఆవరణచుట్టూ మదురుగోడ. మదురుగోడను ఆనుకుని రెండు బొప్పాయిచెట్లు, ఒక చిన్న వేపచెట్టు. వీధిలోనుంచి మదురుగోడల్ని లంఘించి వచ్చి యింటిచుట్టూ చల్లటినీడల్ని సృష్టిస్తూన్న వీధిదీపపు మసకవెలుతురు,

'మీరెంత చెడ్డవారండీ !' అంది శశి నెమ్మదిగా.

తన పాతికేళ్ల జీవితంలో తన్నెవరూ చెడ్డవాడుగా చెప్పుకోలేదని సుధాకరానికి నిశ్చయంగా తెలుసు తాను చాలా మంచివాడు. ఇది లోకులిచ్చిన సర్టిఫికేటు తన మంచితనమే తనకు చదువు, ఉద్యోగం, మనస్సిచ్చే మిత్రకోటి మొదలైనవన్నీ సంపాదించిపెట్టింది. చివరికి ఆ మంచితనమే ఒక చక్కని కానుకను కూడా బహూకరించింది. అది అమూల్యమైన కానుక !

అతని చూపులు తుమ్మెదలకు మళ్లే ఆమె శరీరకునుమంమీద ఆపాదమస్తకం పరచుకొన్నాయి. కాటుకరేఖలతో అవసరం లేని విశాలనేత్రాలు, తాకితేనే కందిపోతాయేమోననిపించే ఎర్రటి చెక్కిళ్ళు, సంపంగిమొగ్గవంటి చిన్నముక్కు, రంగు పులిమిన కలకండ ముక్కల్లాంటి మధురాధరాలు, చిరుకదలికలోకూడా సౌందర్యాన్నీ, లావణ్యాన్నీ రాశిపోసే అంగసౌష్ఠవం—శశిరేఖ అందాలప్రోగు అనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. సుధాకరం తన మూడు మాసాల దాంపత్యజీవితానుభవంలో రూఢి చేసుకున్న విషయమేమిటంటే — శశిరేఖ బాహ్యసౌందర్యమంతాకూడా ఆమె హృదయానికి ప్రతిబింబమే !

'శశీ! నా మంచితనాన్ని బ్రహ్మదేవుడైనా శంకించలేడు. నీలాంటి చక్కని చుక్కను నాకు సతిగా బహూకరించిందెవరనుకుంటున్నావు? నా మంచితనమే! నన్ను చెడ్డవాడనటానికి నీ దగ్గర ఏ ఆధారాలున్నాయి?'

'మువ్వూటికీ మీరు చెడ్డవారే ! వెంట వచ్చిన చిన్నదాన్ని యిలాంటి పాడుకొంపలో దింపి కాపురం చెయ్యమనటం మగాళ్ళకి భావ్యం కాదండోయ్ !'

'లక్షణమైన స్వగృహాన్ని పాడుకొంపంటావేమిటీ? కేవలం వానజల్లుకే వణికిపోయే దానివి, ఈ సంసారపు పెనుతుఫానుకు ఎట్లా తట్టుకోగలవే ప్రియురాలా?'

శశిరేఖ వున్నట్టుండి చెవులు రిక్కించి విన్నది ..'ఆమూల ఎక్కడో వురుముతూన్నట్లుంది కదండీ?'

'లేదే!'... అన్నాడు సుధాకరం. ఆమెకు దగ్గరగా వంగి, గుండె దగ్గరగా చెవిపెట్టి 'ఓహో ! అది నీ గుండెకాయ చప్పుడన్నమాట!' అన్నాడు.

'ఏమిటండీ మీ ధోరణి ! ఒకవైపున వాన భూతంలా వూడిపడబోతుంటే, కొంచెమైనా బాధపడకుండా?' అంటూ అలుక ఒలకబోసింది శశిరేఖ.

'పరాయి మగాడినైనా ముట్టుకోనిస్తావేమోగానీ, వానచినుకునుమాత్రం ముట్టుకోనియ్యవల్లే వుందే!' అంటూ కొంటెగా నవ్వి, ఆటుతర్వాత గొల్లున నవ్వాడు సుధాకరం.

'ఛీ మీ సరసం పాడుగాను ! ... మీకేం తెలుసులెండి నా భయం ?.. వానలో తడిస్తే జ్వరం వస్తుంది నేను చదువుకునే రోజుల్లో స్కూలుకు గైరుహాజరుకావడమంటూ జరిగితే అందుకు కారణం వర్షమే ! గొడుగు చేతికిచ్చినా వానలోకి వెళ్ళలేను. ఒకసారి ఏమయిందంటే— హఠాత్తుగా వానవచ్చేసింది. దొడ్లో ఆరగట్టిన వోణీ తెచ్చుకుందామని దొడ్లోకి పరుగుతీశాను మా తమ్ముడు—కొంటె వెధవ - తలుపుమూసి లోపల గొళ్ళెంపెట్టేశాడు. పావుగంటసేపు వానలో ఉక్కిరిబిక్కిరైపోయాను. అంతే జ్వరం నన్ను పరామర్శించడానికి వచ్చేసింది. మళ్ళీ దాన్ని సాగనంపేసరికి మూడురోజులు పట్టింది...అబ్బ ! ..వానలో తడిస్తే ఎంత చలి వేస్తుందనుకున్నారు!... '

తటాకానికి ఇవతలితీరనుండి అవలితీరానికి రివ్వున ఎగిసిపోయే కొంగలబారులా— గతానికి చెందిన సంఘటన తాలూకు ఊహలు కొన్ని సుధాకరం మస్తిష్కంలో రెపరెపలాడాయి .. తన భార్య వానచినుకులకే తాళజాలనంటూంది. తాను జీవితంలో ఎన్నో వడ

గళ్ళ వానలను తాళగలిగాడు. బాల్యంలోనే తల్లిదండ్రుల్ని కోల్పోయాడు. ఆనాడు తనకు ఏ బంధువూ కంపించలేదు. అయినా స్వయంకృషి అనే దేవతావరం తనకున్నది. స్వయంకృషితోనే చదువుకున్నాడు. స్వయం కృషితోనే ఒక సాధారణ ఉద్యోగం సంపాదించుకోగలిగాడు. కష్టాలన్నీ గడిచి గట్టెక్కిన తర్వాత ... వండువెన్నెలలో ఏకాంతంగా కూర్చుని కోటానుకోట్ల తారకల నడుమ దాగుడుమూతలాడుతూ వినోదించే చందమామను చూచి అనూయపడి అర్థంకాని ఆవేదనతో అలమటించి పోతూన్నకాలంలో — తనకు బంధువులున్నారని ఆ బంధువులేవచ్చి చెప్పకొన్నారు. తన సౌజన్యాన్నీ, సౌశీల్యాన్నీ, సత్ప్రవర్తనను పరోక్షంగానూ, ప్రత్యక్షంగానూ ప్రస్తుతించారు. చేరదీసిచారు. పిల్లనిస్తామన్నారు. సుధాకరం కాలదన్నుకోలేదు.

...దాంపత్య జీవితం సుఖమయంగా సాగిపోతోంది. కానీ, అనుకుంటూ వున్న అవాంతరం రానేవచ్చింది. వర్షఋతువు దగ్గర కొచ్చేసింది ఇంటికి కొత్తగా కప్పు వేయడం తప్ప మార్గాంతరంలేదు.

అది మూడ కణాల పూరిల్లు, తనపెద్దలు తనకు మిగిల్చిపోయిన ఆస్తి. అది బూజుతో, చెదపురుగులతో పాడుగొట్టుకున్న భూత గృహంలావుంది. పాడుపడినట్లున్న ఆ వాతావరణం సుధాకరానికి కొత్తదేమీకాదు నేల మీదపడినప్పటినుండీ అతడు అపూరింటిలోనే వుంటున్నాడు. వానజల్లుతో జలకాలాడించి, చలిబాధతో గజగజలాడించిన వర్షారాత్రులు అతని అనుభవంలో అనేకం వున్నాయి. ఐతే ఆకాలం వేరు. కష్టమైనా, సుఖమైనా—అనుభవించేది తానొక్కడే! కాని తన శరీరంలో ఒక సగభాగాన్ని కష్టాలకు బానిసగా కట్టిపడవేసే హక్కు తనకిప్పుడు లేదు

ఇంటిని మరమ్మతు చేయించాలన్న ఆలోచన తనకు చిరకాలంగా వుంటూ వుంది. అది పెళ్లికి పూర్వమే కార్యరూపం దాల్చి వుండవలసింది. అతడు కొంతడబ్బు నిలువచేసుకోగలిగాడు. ముందు ఇల్లు బాగుచేసుకోవాలి. ఆటుతరువాతే ఇల్లాలు! కాని పరిస్థితులు అలా కలిసొచ్చాయి. పొదుపుచేసిన డబ్బంతా పెళ్లికే ఖర్చయిపోయింది. అందుచేతనే — శశిరేఖ త్వరగా యిల్లు కప్పించమని తొందర చేసే

# వర్షారాత్రి

సరికి—అతడు కొన్నాళ్లపాటు ముందువెనక లాడాడు.

ఈ విషయంలో అతనికంటే ఆమెకే ఎక్కువశ్రద్ధ వున్నట్లుంది. లేకపోతే, తాకట్టుపెట్టి డబ్బుతెమ్మని తనచేతుల కున్న బంగారుగాజులు తీసియిచ్చేది కాదు.

డబ్బు చేతిలోవుంటే, మనిషి చేయలేని పనేముంది? నలభైమోపుల పూరిగడ్డి, వెదురుకర్రలు యింటిముందు వచ్చిపడిపోయాయి, ఇక రావలసినవారు—పనివాళ్లు!

...సన్నగా కునుకురావడంతో సుధాకరం ముందుకు తూలాడు, కందెన పులుముకున్నట్లున్న అంబరవీధిలోనుండి టపటపమని చినుకులు రాలడంతో శశిరేఖ గగ్గోలు పడిపోయింది. 'ఏమండోయ్! లేవండి, లేవండి! చినుకులొచ్చేశాయి..'

సుధాకరం మత్తుగా ఆవలించి, నిద్ర కళ్లతో శశిరేఖ ముఖంలోకి వెర్రిగా చూశాడు దబదబమని చప్పుడు చేస్తూ వరుణదేవుడు వారిద్దరి మీదికీ దూకేశాడు.

'కుండపోతగా వర్షం విరుచుకు పడుతూంటే—కదలరేమండీ?'

సుధాకరం చివాలున పైకి లేచాడు. శశిరేఖ ఇంటిలోపలికి పరుగుతీసింది. పట్టెమంచాన్ని మోసుకుంటూ సుధాకరం ఆమె వెనకాలే లోపలికి నడిచాడు. బట్టలూ, పరుపులూ భద్రపరచు కోడానికైనా వ్యవధి లేకపోయింది. అయిదు నిమిషాల్లోనే యింటిపైకప్పు బాగా తడిసిపోయి, గోడలవెంబడి వాననీరు క్రిందికి దిగజారడం ప్రారంభమైంది. గృహ మధ్యభాగంలో అక్కడక్కడా నీళ్ల ధారగా కారుతున్నాయి. నేల తడిసిపోకుండా వుండటానికి — శశిరేఖ ధారపడుతున్న ప్రతిచోటా—కంచాలు, పాత్రలు అడ్డుపెట్టసాగింది. పరుపుల్నీ, బట్టల్నీ యిల్లు కురవని ప్రక్కగా నెట్టాడు సుధాకరం. షెల్ఫులోవున్న ముఖ్యమైన పుస్తకాలను ట్రంకుపెట్టెలోనికి — పట్టగలిగినంతవరకు కుక్కాడు.

వాన జోరు హెచ్చిపోతోంది, పాత్రలలో నిండిపోయి పొర్లిపోతున్న వాననీటిని బయట పారబోసి, మళ్లీ వాటిని యథాస్థానాల్లో పెట్టడానికే సరిపోతోంది శశిరేఖకు, కాలమంతా! పటపట పండ్లు గీటుతూ విప్పలుకక్కే బ్రహ్మరాక్షసిలా ఆకాశం డమరుక పురుములూ మెరుపుల కత్తుల్ని ఝుళిపిస్తోంది.

'శశీ! ఇప్పుడు మనం ఎక్కడున్నాం? ఇంట్లోనా; బయటా?' అన్నాడు సుధాకరం.

'మీ జోకులు కాస్త కట్టిపెడుదురూ, బాబూ—పుణ్యం వుంటుంది!'

ఇల్లు పూర్తిగా కారుతోంది. వాళ్లిద్దరి శరీరాలూ తడిసి ముద్దయిపోయి, నీరోడుతున్నాయి. పరుపులు, దుప్పట్లు ఇతర వస్త్రాలు మొదలైనవన్నీ వాననీటితో దొప్పదోగుతున్నాయి మూలలో దొంతిమీది చివరికుండ ఎండిపోతోంది. నేలమీద రెండంగుళాల మట్టానికి పెరిగిన నీటిమీద నీటిబుడగలు నాట్యమాడుతున్నాయి. వాన జల్లుపడి దీపంచిమ్మి ఓడుబారింది, సుధాకరం దీపాన్నితీసి గూటిలో వుంచాడు. శశిరేఖ యిక తన ప్రయత్నం వృథా అని తెలుసుకుని, మ్రాన్పడి నిలబడిపోయింది.

పెళ్లి అయినప్పటినుంచీ — పెళ్లాంతో హాస్యాలాడటం 'పార్ట్‌టైం జాబ్' అయి కూర్చుంది సుధాకరానికి. అందుకు అవకాశం లభిస్తేచాలు, అతడు సమయసందర్భాలను కూడా పాటించడు.

'శశీ! అలా పాలరాతి బొమ్మలా మంచోకపోతే, పెట్టెలోనుంచి ఓ పుస్తకం యిలా అందుకోరాదూ?... హాయిగా కాగితపు పడవలు చేసి ఆటలాడుకుందాం' అన్నాడతను నీటిబుడగలకేసి చూస్తూ.

'అందులో నన్ను కూచోబెట్టి ముంచేయండి!' అంది శశిరేఖ విసుగుతో.

పైకప్పు మీదినుంచి ఏదో దబ్బున రాలిపడింది. 'కోడి, కోడి, కోడి, కోడి...' అన్నాడు సుధాకరం గబగబ. శశిరేఖ గబుక్కునవచ్చి అతని భుజాలకు అంటుకుపోయింది. సుధాకరం వెంటనే చీపురు చేతికందుకున్నాడు. రెండు దెబ్బలకే తేలు నజ్జుగుజ్జయి పోయింది. దాన్ని చీపురుతోనే బయటికి విసిరేసి, భార్యకళ్లలోకి విజయగర్వంతో చూశాడు. అతన్ని, అతని చేతిలోని చీపురుకట్టను చూస్తూ శశిరేఖ పకపకనవ్వింది. చీపురుకట్ట జారి క్రింద పడిపోయింది.

శశిరేఖ చీపురు అందుకుంది ఈ రాత్రికి ఈ యిల్లు మొరవపోక తప్పదు ' అంటూ, యింటినంతా ఆక్రమించుకుంటూ వున్న నీటినంతా బయటకు చిమ్మివేయ డానికి ఉద్యుక్తురాలైంది,

సుధాకరం గుమ్మంలో నిలబడ్డాడు వీధికేసి చూశాడు అక్కడక్కడ కరెంటు తీగలమీద ఒక్కక్షణకాలంలో రెండుమూడు చోట్ల నిప్పురవ్వలు చెలరేగాయి మరు క్షణం—వీధి దీపాలన్నీ ఒక్కుమ్మడిగా ఆరి పోయాయి ఊరంతా కటికచీకటి క్రమ్ముకొంది సుధాకరం యింటిచుట్టూ గాఢాంధ కారం, వీధి, మదురుగోడ గడ్డిమోపులు, చెట్లు, ఆకాశం—వీటన్నిటినీ కప్పివేస్తూ నల్లటితెర దిగజారిపోయింది ఇంటిలోపల మాత్రం దీపం గుడ్డిగా వెలుగుతోంది

సుధాకరం లోపలికి వచ్చాడు వర్షం కురుస్తూనే వుంది మెరపులకాంతి పైకప్పును చీల్చుకుంటూ యింటిలోపలికి కూడా ప్రవేశిస్తోంది వానగాలి హోరు హోరున వీస్తోంది 'ఈ వాన యికనైనా ఆగదాండీ ?' అంటోంది శశిరేఖ, అలసి పాలిపోయిన మొహంతో మహోన్నత పర్వత శిఖరమునుండి గండశిల దొర్లించినట్లు — హఠాత్తుగా పెటపెట మంటూ ఒక్కవురుము వురిమి, ఒక్క నిమిషకాలం దిశాంచలాల వరకూ మారు మ్రోగిపోయింది మరుక్షణాన యింటి ముందర బొప్పాయిచెట్టు ఫెళ్లుమన్న చప్పుడైంది దానితోబాటు వేపకొమ్మ ఒకటి పటుక్కున విరిగిపడిన శబ్దం విని పించింది శశిరేఖ హరిణలోచనాలు భీతితో చంచలించాయి బెదురుకళ్లతో ఆమె సుధా కరానికి చాలా అందంగా కనిపించింది తడిసి శరీరాని కంటుకుపోయిన దుస్తులతో, దిగులుతో బిర్రబిగుసుకు పోయిన శశిరేఖను చూస్తుంటే అతనికి జాలి కలగడమేకాదు, ముద్దు గొలిపింది కూడా

సుధాకరానికి లాగే వర్షానికి కూడా ఆమెపట్ల జాలి కలిగిందేమో — వర్షం క్రమంగా తగ్గుముఖం పట్టింది కొంత సేపట్లో పూర్తిగా వెలిసింది

తడిసిపోయిన సుధాకరం చేతులు బిగియ గట్టుకుని నిలబడ్డాడు శశిరేఖ యింట్లోని నీటినంతా చీపురుతో బయటికి చిమ్మి వేసింది తడిసి మట్టిగొట్టుకున్న బట్టలన్నిటినీ బుట్టలోకి కుక్కింది సుధాకరం యిక నుంచోలేక పట్టెమంచం వాల్చు కున్నాడు మంచం చెమ్మవల్ల చచ్చిన జింకలా బిగుసుకుపోయింది ఈవాన మళ్ళీ మన దుంప తెంచుతుందో, ఏమో!' అంటూ శశిరేఖ తన చీరకొంగు, కుచ్చిళ్ళు పిండు కున్నది ట్రంకుపెట్టె తెరిచి, తువ్వాలు పైకి తీసింది, సుధాకరం దగ్గరకివచ్చి అతని తలంతా తుడిచి, తన శిరోజాలుకూడా తుడుచుకుంది పెట్టెలోనుంచి చీర తీసి పట్టుకుంది 'ఏమండీ ? కాస్త బయటికి వెడతారా?'

'అమ్మ బాబోయ్ నిన్ను విడిచి వెళ్ళా లంటే నాకు భయం!' అన్నాడతను కొంటెగా

'పోనీ, కాస్సేపు అటు తిరిగికూర్చోండి' అంది శశిరేఖ నవ్వుతూ

'అలా అన్నావు, బాగుంది' అంటూ అతను అటు తిరిగి, వెనక్కి ఒక దొంగ చూపు విసిరాడు

సిగ్గుతో 'ఛీ !' అంది శశి. 'మంచిగా చెబితే లాభంలేదు వుండండి ' అంటూ



'ఆది దంపతులు'

( నీ. చిత్రం శ్రీ సంపత్‌కుమార్ )

దీపాన్ని ఉప్పున పూదేసింది

'హా! ఘోరం! ఇదేమిటీ?...చీకటి! కళ్ళు పొడుచుకున్నా కానరాని కటిక చీకటి!...అగ్గిపెట్టె ఏదీ?'

'నేనంత తెలివితక్కువదాన్నేమిటీ? ... అగ్గిపెట్టె నా చేతిలోవుంది' చీకటిలోంచి శశినవ్వు, గాజుల గలగలలు వినిపించాయి.

'ఇదిగో! వెంటనే దీపం వెలిగించకపోతే నిన్ను చిదిమి దీపం పెట్టుకోకుండా వూరుకోను.'

మరునిమిషంలో ఆపనే చేద్దామనుకున్నాడు సుధాకరం కానీ అంతలో మళ్ళీ దీపం వెలిగింది. ఆ వెలుగులో— పొడి చీర కట్టుకున్న శశిరేఖ పైట సవరించుకుంటూ, పొడిపంచె తీసి అశనిమీదికి గిరవాటువేసింది. అతడు పంచె కట్టుకుని మంచంమీద కూర్చున్నాడు 'ఇక మ ముహూర్తం బట్టలు తప్పిస్తే, యింట్లో ఒక్క పొడిబట్టయినా లేదు దిండ్లు, దుప్పట్లతోసహా అన్నీతడిసిపోయాయి. ఈ రాత్రి గడపడమెలాగో?' అంది శశి.

తీరనిదాహంలాగా—పైకప్పులో వెదురు కర్రలనుంచి ఒకటి రెండు నీటిబొట్లు రాలిపడుతూనే వున్నాయి. చలిగాలి వీచడం ప్రారంభించింది శశిరేఖ తలుపు మూసివచ్చి మంచంమీద ఒకవారగా కూర్చుంది 'అర్ధరాత్రి కావస్తూన్నట్టుంది కదండీ?'

సుధాకరం మారుపలుకలేదు ఆమెకేసి దీక్షగా చూస్తూవున్నాడు. ఆమె శరీరమంతా కడిగివేసిన పాలరాయిలా నున్నగా

# వర్షారాత్రి

మెరుస్తోంది. తడిసినందుచేత బిరుసుబారిపోయిన ఆమె పరిపూర్ణ యౌవనం శిల్ప సౌందర్యాన్ని తలదన్నగలిగినట్లుంది. ఆమె శిరోజాలు చెదిరిపోయి అలలు అలలుగా క్రిందికిజారి మంచపు వసారాను స్పృశిస్తున్నాయి. అగ్నిటికంటే—ఆమెకళ్లలోని అలుపు అతన్ని ఎక్కువగా ఆకర్షించింది.

పరవశించిన హృదయంతో 'శశీ!' అన్నాడతను.

ఆమె 'ఊఁ!' అంది.

ఇల్లంతా మౌనం వ్యాపించింది. దీపం కొడికట్టి కాంతిహీనమై పోతోంది. శశిరేఖ లేచింది గోడమీద మేకుకు వ్రేలాడుతోన్న కిరసనాయిలు సీసాను అందుకుని, క్షణకాలం ఆశ్చర్యపోయింది. సీసాలో మూడో వంతు మాత్రమే వున్న కిరసనాయిలు సీసా నిండుకూ ఎలా రాగలిగింది? సీసా నిండుకూ వున్నది వాననీరు అని తెలుసుకోటానికి ఆమెకు ఎంతోసేపు పట్టలేదు. ఆమె మళ్ళీవచ్చి మంచంపైన కూర్చుంది.

చలి ఎక్కువవుతోంది. సుధాకరం 'నిద్ర వస్తోందా?' అని అడిగాడు. ఆమె పలుకలేదు. 'అయితే పడుకోరాదూ?... ఈ రాత్రికి ఈమంచమే శరణ్యం!'

'మీ పడుకుని నిద్రపొండి తరవాత పడుకుంటాను.' అంది శశిరేఖ.

సుధాకరం అలా మేను వాల్చాడు. చలి బాధ ఎక్కువై పోతోంది నిద్రముంచుకు వస్తోంది, కప్పుకోటానికి ఏమీలేదు. కడుపులోనికి ముడుచుకున్న ముంగాళ్లను చేతులతో గట్టిగా వాటేసుకున్నాడు. ప్రయోజనం శూన్యం చలికి ఒళ్లంతా కొంకర్లుపోతోంది సుధాకరం శశిరేఖకేసి చూశాడు ఆమె చేతులను గట్టిగా వక్షోజాలమీద కప్పుకుంది. ఆమెకళ్లు మత్తుగా, అరమోడ్పుగా, నిశ్చలంగా వున్నాయి. పెదవులు వణుకుతున్నాయి.

సుధాకర్ లేచి కూర్చున్నాడు. 'శశీ!' అన్నాడు ఆమె తన విశాలనేత్రాలతో అతనికేసి చూసింది

'చలిగా వుందా?' అన్నాడతను.

సమాధానంగా ఒక్క చిరునవ్వు మాత్రం విచ్చిందామె సుధాకరం చేతులు చాచాడు ఆమె సిగ్గుతో తలవంచుకుంది.

దీపం కళ్ళు మూసుకుంది.

కొత్త గడ్డి దులిపి, ఇల్లు కప్పే హడావుడిలోవున్నారు పనివాళ్ళు. ఈ సమయంలోనే శశిరేఖ, సుధాకరం ఒకరి కళ్ళలోకి ఒకరు పలుమార్లు చూచుకున్నారు. వాళ్ళ చూపుల్లోని అర్థాలు ఇతరులకెలా తెలుస్తాయి?

'ఇల్లు యథాప్రకారం వుంటే ఎంత బాగుండేది! వర్షం మరోసారి.. మరోసారి ...ఆ జడివాన...చలిగాలి ... ఉరుములు .. మెరుపులు ..తడిగుడ్డలు...వెచ్చటిచేతులు... కళ్ళలో ఎరుపు...కళ్ళు కూరుకుపోయే నిద్ర మత్తు...నిద్రపోనివ్వకుండా గుండెల్ని గిల్లిపెట్టే కోరికలు...చీకటి...భయం.. వెచ్చని కౌగిట్లో స్వర్గపు తూగుటుయ్యాల......'

సుధాకరం నిట్టూర్చాడు.

శశిరేఖ నిట్టూర్చింది

ఇంటి పైకి ఎక్కి కూర్చున్న వెంకడు తన పనితనాన్ని చాటుకుంటున్నాడు. 'నెలకు మూడువానలుగురిసే రామరాజ్యం వొచ్చినా భయపడాల్సిన పన్లేదమ్మగారూ! ఈ యింటిమీదపడే ప్రతి వాన బొట్టూ చూరుమీదగానే జారాలి పదేండ్లు గ్యారంటీ యిస్తాను! ..'

...అబ్బ! పదేళ్ళు! ఒకటా, రెండా... మూడువేల ఆరువందల యాభయిరాత్రులు! ...అలాంటి రాత్రికోసం...ఆ అపూర్వానుభూతికోసం యిక పదేళ్ళు ఆగక తప్పదా?



# సినిమా

## పడుచుదనానికి పది రకాల అర్థాలు

'రేపు అన్న భయంలేదు రెక్కలే నా ధనం' అన్న సూత్రాన్ని నమ్మి మనుగడ సాగిస్తుంటాడు ఖైదీబాబాయి, సుఖాలనుభవించడంలో, ఆస్వాదించడంలో రెక్కలొంచి పనిచేసే నిరుపేద, వక్రమార్గంలో విక్రమార్గంలో డబ్బు గడించే వాళ్లకంటే ఓ అడుగు ముందేవుంటాడనడానికి ఖైదీబాబాయే నిదర్శనం

రాత్రనక, పగలనక లారీతోలి బడలిక తీర్చుకోవడానికని కాస్త సారా తాగుతాడు ఆ కైపులో 'తిలకం' అనే వ్యభిచార స్త్రీగృహంలో ప్రవేశించి, పడుచుదనానికి పది రకాల అర్థాలు చెపుతాడు 'నువ్వు తప్ప నా కెవ్వరూ వద్దు నీమీద ఒట్టు'అంటుంది తిలకం 'ఒట్టు నిలుపుకోవడం నీ పుట్టుకలోనేలేదు' అన్నాడు ఖైదీబాబాయి 'అలాగేం' అంటూ అతన్ని కవ్వించి, తన బిగి కవుగిలిలో బిగించింది తిలకం 'కట్' అన్నారు దర్శకుడు టి కృష్ణ ఈ సన్నివేశం శ్రీ బాలాజీ చిత్రవారి 'ఖైదీబాబాయ్' చిత్రంలో కనిపిస్తుంది టైటిలు పాత్రను శోభన్‌బాబు, తిలకంగా లీలారాయ్ నటించారు టి బాబుల్‌నాథ్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన యీ చిత్రానికి వాణిశ్రీ కథానాయిక ఈ చిత్రం అతిత్వరలో లక్ష్మీ ఫిలింస్‌ద్వారా విడుదలవుతుంది

*ఎదిగిన డైరెక్టరు*

అయితే చిత్రం ఎంత చక్కగా రుపొందుతుంది, ఎడిటరుగావుండిన కృష్ణ డైరెక్టరుగా ఎంత ప్రతిభను ప్రదర్శించాడో, 'ఖైదీబాబాయ్' చిత్రం చూస్తే తెలుస్తుంది శోభన్ నటజీవితంలో యిదొక కొత్త మలుపును తెస్తుంది అదృష్టవంతుడికి అవకాశాలు వెతుక్కుంటూ వస్తాయి శోభన్ అదృష్టవంతుడు



మైనరుబాబు లో శోభన్‌బాబు, హేమ

## చిన్నపరెడ్డి రష్యాపయనం!

మాస్కోలో జరుగుతున్న చలన చిత్రోత్సవంలో ఉషశ్రీ చిన్నపరెడ్డి పాల్గొన్నారు ఆ ప్రభుత్వం పంపిన ఆహ్వానం తంతిరూపాన అందుకొన్నారు, చిన్నపరెడ్డి జులై 11న, రష్యాపయనం అయ్యారు- పదవతేదీ సాయంత్రాన ఉషశ్రీ యూనిట్ సభ్యులు చిన్నపరెడ్డిని అభినందించారు సభకు క్యారెక్టరు నటుడు నాగభూషణం అధ్యక్షత వహించారు డాక్టర్ నారాయణరెడ్డి, అనిరుద్ధ, జాన్సన్, మాగాపురామన్, వెంకట్, శ్రీనివాస్ చిన్నపరెడ్డిని, ఆయన గుండెబలాన్ని, మంచి హృదయాన్ని సభికులకు తెలియచేశారు

*విజయవాడలో స్టుడియో*

నేను సరదాగా, జల్సాగా వెళ్లడంలేదు రష్యాకు వాళ్ల సహకారం లభిస్తే, వాళ్ల ఎక్విప్‌మెంటుతో విజయవాడలో స్టుడియో నిర్మించాలనివుంది ఆంధ్రదేశంలో, స్టుడియో నిర్మించే అదృష్టం నాకు దక్కుతుంది నావల్ల వంద కుటుంబాలు బ్రతికితే అదే నాకు ఆర్జన అవుతుంది', అన్నారు చిన్నపరెడ్డి

## విడాకులు

చిన్నపరెడ్డి వ్రాసిన కథ యిది ఇది సాంధ్యశ్రీ ప్రొడక్షన్స్ త్రినాథరావుకు నచ్చింది 'మనువు—మనసు' పూర్తిచేసిన యీనిర్మాత తన రెండవ ప్రయత్నంగా 'విడాకులు' తీయ సంకల్పించారు సినిమా అనుకరణ కూడా చిన్నపరెడ్డిదే కృష్ణ జమున ప్రధానపాత్రలను పోషిస్తారు దర్శకత్వం మరష్యా రిటర్న్‌డ్ చిన్నపరెడ్డి చేపట్టారు మాటలను గోపీ రాస్తున్నారు

## అక్కినేని చిత్రానికి గోపీ

గోపాలకృష్ణ ప్రొడక్షన్స్ నిర్మించబోయే చిత్రానికి గోపీ మాటలను రాస్తున్నారు కె గోపాలకృష్ణ నిర్మిస్తున్న, కె హేమాంబరధరరావు దర్శకత్వం నెరపుతున్న యీ చిత్రంలో నాగేశ్వరరావు ద్విపాత్రాభినయం ఒక ప్రత్యేక ఆకర్షణ అక్టోబరులో షూటింగు ప్రారంభమై, ఫిబ్రవరికల్లా విడుదలకు సిద్ధమయ్యే విధంగా ఏర్పాట్లు జరుగుతున్నాయి

## పగపట్టిన పడుచు

ఆడది అనుగ్రహిస్తే అమృతం చిందిస్తుంది ఆగ్రహిస్తే విషం క్రక్కుతుంది ప్రాణానికి ప్రాణంగా ప్రేమించి, నన్ను



ప్రమాణాలుచేసిన ప్రియుడు డబ్బు మోజుతో తననుకాదని పిచ్చిదానికి తాళికట్టాడని పగ బట్టిందాపడుచు మనసు లేకపోయినా, డబ్బుంటే చాలు అది మనిషిని కొంటుంది, మనిషిలోని మనసునూకొంటుందని భావించి, వయస్సు మళ్లినతన్ని వివాహమాడడానికి నిశ్చయించుకొంది తననుకాదన్న ప్రియుడు తన యింటిలో తన ఆజ్ఞకు బద్ధుడై నడిచేవాడన్న తలపు గుర్తుకురాగానే ఆమెలో పగ, ద్వేషం ప్రజ్వరిలాయి

'మనసును డబ్బుకు తాకట్టుపెట్టేన వాళ్లగురించి తనకు తెలుసునని, తానా యింటికి వచ్చింది డబ్బుతో సుఖపడదామని కాదని, డబ్బుకోసం పవిత్రప్రేమను, పరువునుగూడా అమ్ముకొనే వాళ్ల ముఖాలు పాలెయ్యడానికని' అంది,

పగ, ద్వేషం రగిలించే పడతిగా చంద్రకళ, ప్రియుడిగా ప్రకాష్ నటించిన పైసన్నివేశం సాంధ్యశ్రీ ప్రొడక్షన్సువారి 'మనువు—మనసు' చిత్రంలో కన్పిస్తుంది ఎన్నో ఏండ్ల తర్వాత హాస్య జంట పద్మశ్రీ రేలంగి రమణారెడ్డిల హాస్యలహరిలో సరికొత్త సన్నాహాలతో ముస్తాబు అవుతుంది ఈ చిత్రం ముఖ్యపాత్రలను చంద్రమోహన్, ముక్కామల, వల్లం నరసింహారావు, కృష్ణకుమారి, విజయలలిత, అనిత పోషించిన ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం పి చిన్నపరెడ్డి

మాటలను గోపీ, సంగీతాన్ని అశ్వద్ధామ, కెమెరాను యన్ ఆర్ కె మూర్తి, సహకార దర్శకత్వాన్ని మోహన్‌గాంధీ, నిర్వహించిన పై చిత్రానికి పి త్రినాధరావు నిర్మాత తారకరామా విడుదల

## మరపురాని మనిషి

గా నాగేశ్వరరావు మరువలేని నటన్ను ప్రదర్శించిన చిత్రమే ఉమా ప్రొడక్షన్స్ వారి 'కనిపించే దేవుడు' ఈ చిత్రానికి 'జీవనతరంగాలు' ఫేమ్ తాతినేని రామారావు దర్శకుడు

### పేరు మార్పు!

ఇంతవరకు 'కనిపించే దేవుడు'గా పాఠకులకు పరిచయమైన యీ చిత్రానికి కథానుగుణ్యమైన పేరును మార్చవలసి వచ్చింది, అందుకే 'మరపురాని మనిషి' అని నామకరణమే జరిగింది ఈ చిత్రానికి ఆచార్య హీరోగా వ్యవహరించారు, మాటలను వ్రాయడంవరకు

### నాగేశ్వరరావే పాత్ర!

సామాన్య రిక్షా అచ్చిగావుండి నిండు హృదయం కలిగిన మానవోత్తముడి పాత్ర నాగేశ్వరరావుగారిది ఒకపూట అన్నం పెట్టిన కుటుంబానికి, తన జీవితాన్ని ధారపోసిన పుణ్యపురుషుడి పాత్ర ఆయనది మావయ్యా అని పిలిచిన మరుక్షణమే ఆత్మీయతను, అనుబంధాన్ని అల్లుకుని, అన్నీచేసిన త్యాగమూర్తి పాత్ర ఆయనది రాత్రింబవళ్లు కష్టించి రిక్షా నడిపి, ఆ డబ్బుతో మావయ్యా' అని పిలిచిన అమ్మాయికి నల్లకోటు చదువు చెప్పించిన పుత్తమోత్తముని పాత్ర అక్కినేనిది, అలాంటి వుదాత్తమైన పాత్రలో ఉత్కృష్టమైన నటన్ను ప్రదర్శించారు చిరంజీవి నాగేశ్వరరావు

### జయంతి తక్కువ చేసిందా?

మరపురాని మనిషిగా అక్కినేని ఎంత అద్భుతంగా నటించారో, ఆయనకు తోబుట్టువుగాని అక్కయ్యగా, విధి వంచితురాలిగా, విధవగా అసాధారణంగా నటించింది వీరిద్దరితోబాటు రంగారావు, గుమ్మడి, నాగభూషణం, రాజబాబు, లత, మంజుల, రోజారమణి, చంద్రమోహన్ మరియు జగ్గయ్య ముఖ్యపాత్రలను పోషించడంవల్ల కథ పకడ్బందీగా తయారైంది ఈ చిత్రం ఎస్ వెంకటరత్నంగారి మరొక అంతస్తును తెచ్చిపెడుతుంది 'జీవనతరంగాలు' తర్వాత తాతినేని రామారావుకు అఖండవిజయాన్ని చేకూర్చగల చిత్రమే ఎస్ ఎస్ భట్ నిర్మించిన 'మరపురాని మనిషి' అన్నపూర్ణ డిస్ట్రిబ్యూషన్‌కి 'విచిత్రబంధం, బంగారుబాబు' చిత్రాల తర్వాత క్రెడిట్ తెచ్చే చిత్రం అవుతుంది, 'మరపురాని మనిషి'

## జీవన తరంగాలు
## 1200 రోజుల పండుగ

సురేష్ మూవీస్‌వారి 'జీవనతరంగాలు' చిత్రం 12 కేంద్రాలలో నూరురోజుల పండుగ జరుపుకుంటుంది ఆగస్టు అయిదవ శతదినోత్సవసభను విజయవాడ అలంకార్ థియేటర్లో జరపడానికి నిశ్చయించినట్టు, నిర్మాత రామానాయుడు చెప్పారు 12 కేంద్రాలలో నూరురోజులు ప్రదర్శింపబడడంవల్ల, $12 \times 100$=పన్నెండు



'ఖైదీబాబాయ్'లో శోభన్‌బాబు, లీనారాయ్

పండలరోజుల పండుగ అని మకుటం పెట్టొచ్చును ఈ చిత్ర విజయం తాతినేని రామారావుకు చెందాలి ఆయన ప్రతిభ ప్రతి ఫ్రేములో కనిపించింది, ఈ చిత్రంలో

## పసివాని పగ

యంగ్‌టర్క్స్ ప్రొడక్షన్స్ వారి 'పసివానిపగ' పూర్తయి, సెన్సారై విడుదలకి సిద్ధంగావుంది పీకులు చెప్తూ, గోతులు త్రవ్వే రకాల మనస్తత్వాలను వివరించే చిత్రమే 'పసివాని పగ.'

'సిరికి ఎంత దూరమైతే శివునికి అంత దగ్గరౌతాము' అన్న పెద్ద మనిషి, అదే నోటితో ఆ 'సిరిసంపాదనే తన జీవిత ధ్యేయం' అంటూ అసలు రంగుతో బయట పడ్డాడు ఈ చిత్రంలో

వంగివాచి మాటలు మాట్లాడుతూ దొంగపనులుచేసే వయవంచకుల ప్రతిబింబాలను ప్రస్ఫుటపరుస్తుంది 'పసివాని పగ'

మాస్టర్ ప్రభాకర్, విజయచందర్, విజయలలిత ప్రధానపాత్రలను పోషిస్తున్న ఈ చిత్రంలో ప్రభాకరరెడ్డి, త్యాగరాజు అల్లు రామలింగయ్య మిక్కిలినేని, పొట్టి ప్రసాద్, జ్యోతిలక్ష్మి, హలం, సూర్యకాంతం, హేమలత, లీలారాణి, విజయభాను, బేబీ సుమతి తదితరపాత్రలను పోషిస్తున్నారు

## సినిమా

యస్ చిట్టిబాబు నిర్మించిన ఈ చిత్రానికి దర్శకత్వాన్ని కె యస్ కుటుంబరావు, మాటలను దాసం గోపాలకృష్ణ, ఛాయను దేవరాజ్, సంగీతాన్ని పుహళేంది, సహకార దర్శకత్వాన్ని యస్ పి. రంగారావు నిర్వహించారు కె యం నాయుడు ఎగ్జిక్యూటివ్ నిర్మాత

## మేమూ మనుష్యులమే !

తనకున్నా లేకున్నా, తామున్నా లేకున్నా, తన కడుపు పుట్టిన బిడ్డ విద్యావంతుడు కావాలి, బుద్ధిమంతుడు కావాలి అని కోరుకుంటుంది ప్రతి తల్లి విద్యకు అర్థం చెప్పమని తన బిడ్డను విద్యావంతుని చేయమని అర్థిస్తుంది తయానిధి కుప్పి మనుష్య దయానిధి, ఆ తల్లి నివేదనలో ఆవేదనను గుర్తించి, ఆవిడ బిడ్డను, తన బిడ్డగా పెంచి ప్రయోజకుడ్నిచేస్తానని ప్రమాణం చేస్తాడు, సంతృప్తిగా సంతోషంగా వెళుతుంది కుప్పి

పై రసవత్తర సన్నివేశం కల్పనాలయా వారి 'మేమూ మనుషులమే'లోనిది 'వింత దంపతులు' చిత్ర ద్వారా దంపతులుగా పరిచయం అయిన జమున, కృష్ణంరాజులు నాయకీ నాయకులుగా నటిస్తున్న ఈ చిత్రంలో చంద్రమోహన్, ప్రమీల రెండో జంటగా, జగ్గయ్య, పుష్పలత, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, త్యాగరాజు, సాక్షి రంగారావు సీతారాం, కేశవరావు, కుమార్, కోళ్లసత్యం, కె వి చలం, డా॥ భానుమతి, అనూరాధ, జ్యోతిలక్ష్మి, మరియు ప్రసాద్, రవీంద్రనాథ్ (నూతన నటులు) ముఖ్యపాత్రధారులుగా నటిస్తారు.

సహజత్వానికి ఎన్నిపెట్టింగాపున్న ప్రదేశాల్లో దర్శకుడు బాపయ్య నిర్దేశకత్వంలో కొన్ని సన్నివేశాలను చిత్రీకరించడం జరిగింది.

మాటలను పినిశెట్టి పాత్రలను ఆత్రేయ సంగీతాన్ని యం యస్ విశ్వనాథన్ కళను దిలీప్‌సింగ్, ఛాయను పి భాస్కరరావు సమకూర్చారు. శ్రీ ఫిలిమ్స్ విడుదలచేసే ఈ చిత్రానికి వాసంతి బి ఏ నిర్మాత

## పల్లె పడుచుగా జయలలిత

నాగరికత పెరిగిపోయిన పట్టణాల్లో పదిమంది కాలేజి అమ్మాయిలు రకరకాల దుస్తుల్లో పిక్నిక్‌ల కెళ్లినపుడు రొమాంటిక్ డాన్సులు, రాక్—ఎన్—రోల్ డాన్సులు చేస్తారు అదే అమాయకులైన పల్లెటూరి పిల్లలు, ఒక చోట కలిస్తే, మనసులోని అనుభూతిని, తమకువచ్చిన భాషలో ఆనందంగా ఆడుతూ, పాడుకొంటారు జయలలిత గూడా అదే పనిచేసింది

'అల్లనేరేడు సెటు కాడ అమ్మలారా
లేతనూరీడు పాడిచాడే అమ్మలారా
వాడిసూపుల్లో ఏముందో అమ్మలారా
నాకు సురకెత్తె—అమ్మో సురకెత్తె
నాకు సురకెత్తిపోయిందె అమ్మలారా'

అంటూ మైమరచి పాడింది జయలలిత (గీత) చలపతిరావు సంగీత దర్శకత్వంలో, నారాయణరెడ్డి విరచితమైన పై పాటను గానకోకిల సుశీల పాడింది జయలలితకుగాను 'డాక్టర్ బాబు' చిత్రంలో

రవీంద్రా ఆర్ట్ పిక్చర్సు నిర్మించిన 'డాక్టర్‌బాబు'లో టైటిల్ రోల్‌ను శోభన్‌బాబు, విజయలలిత, జి వరలక్ష్మి, లీలారాణి యస్ వి రంగారావు, గుమ్మడి, రాజబాబు, రాజనాల అల్లు రామలింగయ్య ముక్కామల ముఖ్యపాత్రలను పోషించారు



'పల్లెటూరిబావ'లో నాగేశ్వరరావు

తమ్మారెడ్డి కృష్ణమూర్తి నిర్మించిన ఈ చిత్రానికి లెనిన్‌బాబు దర్శకత్వం, కన్నప్ప ఛాయాగ్రహణం, నారన్న కళ, అక్కినేని సంజీవి కూర్పు, మోదుకూరి జాన్సన్ మాటలు మరింత శోభను చేకూర్చాయి లక్ష్మీ ఫిలింస్ విడుదల

## నౌకర్లు కూడా మనుష్యులే!

మైనర్‌బాబు నిజంగా మైనరుబాబు ఫ్రెండ్సుని వెంటవేసుకుని, సరదాగా అర్ధరాత్రి దాకా తిరగటం అంటే అతనికి చాలా సరదా! అలవాటు ప్రకారం ఇంటి కొచ్చేసరికి అర్ధరాత్రి దాటింది నౌకర్లందరూ కూడా నిద్రపోయే సమయం అది ఎవరూ రానందుకు అందర్నీ తిడుతుండగా రాఘవయ్య ఎదురయ్యాడు

'నాన్నా! మీరా! ఏమిటినాన్నా మీరింకా నిద్రపోలా!' అన్నాడు ఆశ్చర్యంగా రాము

'ఇంతకాలం నిద్రపోతూనే వున్నా, ఈరోజే మేల్కొన్నాను ఎప్పుడో ఒకప్పుడు మేలుకోవాలిగా! రాబాబూ, భోంచేద్దాం!' అన్నాడు ద్వందార్థం వచ్చేట్టుగా రాఘవయ్య భోజనం పళ్లెం సర్దుతూ

'అదేమిటినాన్నా — నీ కెందుకీ పని నౌకర్లంతా ఏమయ్యారు ?' అన్నాడు ఆవేశంగా రాము

'నిద్రపోతున్నారు బాబూ — వాళ్ళను లేపొద్దు తెల్లవారి ఏ నాలుగు గంటలకో నిద్రలేస్తారు రాత్రి పదింటి వరకూ చాకిరి చేస్తారు, మళ్లీ ప్రొద్దున్నే లేవాలి!' అన్నాడు రాఘవయ్య నౌకర్లు కూడా మనుష్యులే అన్న అభిప్రాయం స్ఫురింప చేస్తూ

పై సన్నివేశాన్ని సారధి అండ్ టి పి ఆర్ కంబైన్సువారి 'మైనరుబాబు' చిత్రంలో చూడవచ్చు ప్రముఖ దర్శకులు తాతినేని ప్రకాశరావు దర్శకత్వంలో తయారైన ఈ చిత్రంలో శోభన్, రంగారావు, గుమ్మడి చంద్రమోహన్, అల్లు రామలింగయ్య రాజబాబు, వాణిశ్రీ, అంజలీదేవి, లీలారాణి ముఖ్య పాత్రధారులు

ఆత్రేయ, భమిడిపాటి మాటలను, చలపతిరావు సంగీతాన్ని, కె యస్ ప్రసాద్ కెమెరాను నిర్వహించిన ఈచిత్రం నవయుగ విడుదల.

## డబ్బు ఏమయినా చేయిస్తుంది!

అన్యోన్యంగా వున్నవారి మధ్య అగాధాలను సృష్టిస్తుంది డబ్బు హత్యలను, అరాచకాలను, అక్రమాలను చేయడానికి పురి కొల్పుతుంది డబ్బు రక్త సంబంధాన్ని సన్నిహితత్వాన్ని విస్మరింపచేస్తుంది డబ్బు

నవీనయుగంలో డబ్బు గడించడం కోసం జరుగుతున్న ఎన్నో కుతంత్రాల్లో స్త్రీ ప్రధానపాత్ర వహిస్తున్నదన్న నిజాన్ని నిరూపించిన చిత్రమే నవోదయ ఆర్టు పిక్చర్సువారి 'జగమేమాయ'

ఒక జమీందారీ కుటుంబంలో జరిగిన చక్కని కథకు, ఒకరిద్దరు తప్ప అంతా నూతన నటీనటులతో రికార్డు టైంలో నిర్మించిన ఘనత నవోదయ ఆర్టుపిక్చర్సు వారికే దక్కింది

పూర్తి అవుట్‌డోర్లో నిర్మించబడి ఈ చిత్రంలో వున్న నాల్గుపాటల్లో రెండు పాటలు రంగుల్లో చిత్రీకరించబడ్డాయి ఏ పూర్ణచంద్రరావు నిర్వహణలో నిర్మాత పి వి సుబ్బారావు నిర్మించిన ఈ న్యూవేవ్ చిత్రం జూలై 27 న ఆంధ్ర దేశం అంతటా విడుదల అవుతుంది,

నూతన నటులు మురళీ మోహన్, గిరిబాబు నూతన నటి నందని. విజయలలిత, రాజబాబు, నాగయ్య, విజయలు ప్రధాన పాత్రలను పోషించార

మాటలను గొల్లపూడి సత్యం సంగీతాన్ని, కెమెరాను కె యస్ మణి, కూర్పును బాలు, దర్శకత్వాన్ని ఐ ఎన్, మూర్తి నిర్వహించిన ఈ చిత్రం లక్ష్మీ ఫిలిమ్స్ ద్వారా విడుదలౌతుంది

## జీవితాశయం

ప్రపంచంలో అనేకరకాల మనస్తత్వాలు వ్యక్తులు ఎంతోమంది వుంటారు కొంత మంది ఏ లక్ష్యంలేకుండా, గాలివాటుగా జీవితం ఎటు తీసుకెళితే అటు పోతూ, ఆటుపోట్లకు గురి అవుతుంటారు మరి కొంతమంది జీవితంలో ఒక లక్ష్యాన్ని అలంబనగా చేసికొని, ఆ లక్ష్యాన్ని సాధించటంకోసం చివరి ఆత్మార్పణ చెయ్యటానికికూడా వెనుకాడకుండా జీవితాన్నే పణంగాపెట్టి యమయాతనలు అనుభవిస్తారు ఆధునిక సమాజంలోవున్న విభిన్న మనస్తత్వాలుగల వ్యక్తిత్వాలకు ప్రతిరూపమే సప్తగిరి ప్రొడక్షన్సువారు నిర్మిస్తున్న 'జీవితాశయం'

ఇంతవరకూ జరిగిన షెడ్యూల్స్ లో దాదాపు ఎనిమిదిరీళ్ల చిత్రం తయారైంది



'డాక్టర్ బాబు'లో శోభన్‌బాబు, జయలలిత.

జయంతి ఏ పాత్రను పోషించినా ప్రత్యేక కతను కనపరుస్తుందనడానికి ఈ చిత్రం లోని పాత్ర మరో నిదర్శనం. ఎస్. వి. రంగారావు, నాగభూషణం, కృష్ణంరాజు, శ్రీధర్, కె. వి. చలం, రావుగోపాలరావు, రావికొండలరావు, పి. హెచ్. కృష్ణమూర్తి, విజయనిర్మల, పుష్పకుమారి, రాధాకుమారి నటించారు ఈ చిత్రంలో.

యతిరాజా నరసింహస్వామి, జయంతి శ్రీనివాసశెట్టి నిర్మిస్తున్న ఈ చిత్రానికి నిర్దేశకత్వాన్ని కమలాకర కామేశ్వరరావు నిర్వహిస్తున్నారు పూజారి వెంకటేశప్ప, జయంతి రాధాకృష్ణ సహనిర్మాతలైన ఈ చిత్రానికి రాజేశ్వరరావు సంగీతాన్ని, సముద్రాల జూనియర్ మాటలను, వి. యస్. ఆర్. కృష్ణారావు కెమెరాను, తోట్లకళ్ళను గోపాలరావు కూర్పును, సమకూర్చారు.

## బహుముఖ ప్రజ్ఞావంతురాలు!

భరణి పిక్చర్సువారి 'విచిత్రవివాహం' తాలూకు షూటింగు దాదాపు పూర్తయింది. ఇంతవరకు 6 పాటల చిత్రీకరణ జరిగింది.

పాతకాలపు చాదస్తంతో పిల్లల ఇష్టాయిష్టాలను గమనించని పెద్దలను నేటి సమాజంలో వెర్రితలలువేస్తున్న నాగరికపు మోజులో, గుడ్డిప్రేమతో, భవిష్యత్తును గాఢాంధకారం చేసుకొంటున్న యువతీయువకులకు హెచ్చరికగా వుండే చిత్రంగా, ఎలాంటి అశ్లీలపదాలు, రేప్‌సీన్స్, నగ్నదృశ్యాలు, క్లబ్ డాన్సులు లేని చిత్రంగా, ఇంటిల్లిపాదీ పిల్లలు, పెద్దలూ కలిసి కూర్చొని చూడదగ్గ చక్కని చిత్రంగా నిర్మింపబడుతోంది.

'మట్టిలో మాణిక్యం'లో లలితగానూ, 'అంతా మనమంచికే'లో సావిత్రిగాను నటించి సంచలనాన్ని సృష్టించిన పద్మశ్రీ భానుమతిగారు ఈ చిత్రంలో దుర్గాదేవిగా కొత్త తరహా పాత్రను పోషిస్తున్నారు.

గుణచిత్ర నటుడు గుమ్మడి మరో ముఖ్య పాత్రను నిర్వహిస్తున్నారు. ప్రేయసీ ప్రియులుగా కుమారి ప్రమీల, చంద్రమోహన్; హాస్య జంటగా రమాప్రభ, పద్మనాభం, ఇంకా రాజనాల, అల్లు రామలింగయ్య ముక్కామల, పొట్టి ప్రసాద్, ఇందిరాశర్మ, నీలా అయ్యర్ ముఖ్య పాత్రధారులు.

నేటి యువతీ యువకుల ప్రేమపోకడల్ని వ్యంగ్యంగా వెల్లడిస్తూ—వారి తొందరపాటును హెచ్చరిస్తూ, గాయనీ, దర్శకురాలు రచయిత్రి అయిన భానుమతి నటిస్తూ పాడిన

'నాగరికత పేరుతో—నవ్వుల పాలయ్యేరు
దోరవయసు జోరులో దారితప్పి పొయ్యేరు
నామాటలో నిజం వింటారా! మీరూ
అబ్బాయిలూ, అమ్మాయిలూ...'

పాటను ఇటీవలే సెల్యులాయిడ్‌పై మలిచారు.

కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వాన్ని భానుమతీ రామకృష్ణ, మాటలను భానుమతి రామకృష్ణ, సముద్రాల రామానుజం, సంగీతాన్ని సత్యం, ఛాయను లక్ష్మణ్ గోరే నిర్వహించారు. నవయుగ విడుదల.

## ఆగస్టు 9న దేవుడుచేసిన మనుషులు

హీరో కృష్ణ సమర్పించు రంగుల చిత్రం 'దేవుడు చేసిన మనుషులు' ఆగస్టు 9 న, తారకరామ ద్వారా ఆంధ్రప్రదేశ్‌లో విడుదలవుతుంది. ఈ చిత్రానికి బి. రామచంద్రరావు దర్శకుడు.

### వేట ప్రారంభం

'మాకు యివ్వండి, మేము ఎంతయినా యిస్తాము' అంటూ థియేటరు యజమానులు వెంటాడుతున్నారు. హీరో కృష్ణను. ఈ చిత్రంపై ప్రేక్షకులు కొండంత ఆశ పెట్టుకొన్నారు. అందువల్లనే యీ వేట ప్రారంభం అయింది.

### కథ, నిర్మాత

'దేవుడుచేసిన మనుషులు' కథను నిర్మాత జి. హనుమంతరావు వ్రాశారు. ఆకథకు మహారథి మాటలను ముత్యాల్లాగా పొదిగారు. ఆయన కలం మహాత్మ్యం యీ చిత్రంలో కనిపిస్తుంది. రమేష్‌నాయుడు సమకూర్చిన సంగీతం సుపర్బ్ అంటున్నారు.

### ఉన్నతమైన నటన

ఈ చిత్రంలో ఎన్టీ రామారావు, కృష్ణ అన్న, దమ్ములుగా నటించారు. వాళ్లకు తండ్రిగా ఎస్వీరంగారావు నటించారు. విలన్ వేషాలను జగ్గయ్య, కాంతారావులు ధరిం



'మనుషు — మనము'లో చంద్రకళ, ప్రకాష్.

చారు. నాయికల పాత్రలను జయలలిత, విజయనిర్మల, కాంచన పోషించారు. ఎవరు ఎవరిని అధిగమించి నటించారో, చిత్రం చూచే ప్రేక్షకులు చెప్పవలసినదే వి. ఎస్. ఆర్. స్వామిని గూర్చి వేరే వ్రాయాలా? ఇదొక చరిత్రను సృష్టించడం తథ్యం.

## సుబ్బరాజు రెండో చిత్రంలో మహారథి

'దేవుడుచేసిన మనుషులు' చిత్రానికి అత్యుత్తమ రచన చేసిన మహారథిని, శ్రీవాణి కంబైన్స్ ఎస్. వి. సుబ్బరాజు తమ రెండవ చిత్రానికి రచయితగా నియమించారు.

జులై 20న 'స్నేహబంధం' విడుదల. రెండవ చిత్రం సెప్టెంబరు నుండి వుంటుంది. కృష్ణ, జమున ముఖ్యపాత్రధారులు. పి. చంద్రశేఖర రెడ్డి దర్శకుడు, బి. అచ్యుతరామరాజు సమర్పించు యీ చిత్రం అన్నపూర్ణా ద్వారా విడుదలవుతుంది.

## ఆరాధనలో కొత్త నటుడు

జెమినీ స్టుడియోస్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న 'ఆరాధన' తెలుగు చిత్రం షూటింగు యీనెల 16 న వారి స్వంత స్టుడియోలో ప్రారంభం అయింది. జెమినీ అధినేత ఎస్. ఎస్. బాలన్ దర్శకుడు, శోభన్ ద్విపాత్రాభినయం చేస్తున్న యీ సినిమాలో గాంధీబాబు అనే కొత్త నటుడ్ని పరిచయం చేస్తున్నారు. హిందీలో సుజిత్‌కుమార్ ధరించిన పాత్రను ఆయనకు యిచ్చారు. వాణిశ్రీ, లత, గీతాంజలి, ప్రభాకరరెడ్డి మరియు గుమ్మడి ప్రధాన పాత్రధారులు. ఈ చిత్రానికి రాజశ్రీ రచన్ను, కుమార్ సంగీతాన్ని, కపాడియా ఛాయను. దశరధరామిరెడ్డి సహదర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

— శ్రీనివాస్

# సిమీ బ్యూటీ బులెటిన్

లేక

# అందానికి చిట్కాలు

**అందాల తార సిమీ అందానికి, ఫాషన్‌కి తగిన చిట్కాలు తెలుపుతుంది. వ్యక్తిగత మయిన ప్రశ్నలకి సమాధానాలు ఇవ్వలేనని తెలుపటానికి ఆమె చింతిస్తోంది! సాధారణంగా అందరికీ ఉపయోగంగా ఉండే ప్రశ్నలనే 'SIMI'S BEAUTY BULLETIN, Post Bag No. 7117, BOMBAY 400014 కి పంపవచ్చు.**

ప్ర : ముఖం కడుక్కున్న తర్వాత నల్లగా మాడిపోయినట్టు అయిపోతుంది. అసలే నా రంగు నలుపు. మరీ నలుపై పోతున్నాను. ఏం చేయ్యమంటారు ?

జ : మీరు ఏం సబ్బు వాడుతున్నారు ? మీ చర్మానికి తగిన సబ్బుకాకపోవచ్చు. మరో సబ్బును ఉపయోగించండి. మెడికేటెడ్ సబ్బు అయితే మంచిది. సెనగపిండిగాని మీగడ కలిపిన నిమ్మరసంగాని రాసుకుంటే గుణం కనిపిస్తుంది. ఇదీ పని చెయ్యకపోతే ఎవరన్నా స్కిన్ స్పెషలిస్టును చూడండి.

ప్ర : నా ముఖం గరుగ్గాను, జిడ్డుగాను వుంటుంది, అస్తమానూ పేలుతూ వుంటుంది. అందవికారంగా తయారయి పోతున్నాను. నివారణకి ఉపాయం ఏదన్నా చెప్పండి.

జ: ప్రిక్లీహీట్ సోప్, పౌడర్లు ఉపయోగించడంవల్ల చర్మం పేలడం తగ్గిపోతుంది. మీ చర్మం నునుపుగాను మృదువుగానూ వుండాలంటే నరిసింగ్ క్రీమ్ ఏదన్నా ఉపయోగించండి. క్రీమ్‌లావుండే బాడీలోషన్ కూడా వుంది. దాన్ని ఉపయోగించండి. రాత్రి పడుకోబోయే ముందు ఈ ప్రకారం చెయ్యండి. బొప్పాయికాయికోసి ఆ ముక్కలను రుద్దుకున్నా జిడ్డుముఖం వుండదు.

ప్ర : నా వెంట్రుకలు పొడవుగాను, దట్టంగాను, మృదువుగాను వుండాలంటే ఏం చెయ్యాలి? నేను రోజూ ఈత నేర్చుకుంటున్నాను దీనివల్ల నష్టమేమైనా వుందా ?

జ : తడిసిన తర్వాత ఎండలోవుంటే వెంట్రుకలు బిరుసెక్కిపోతాయి. 'బేతింగ్ కేప్' ఉపయోగిస్తే — నీటిలో ఉప్పువల్ల, ఎండవల్ల మీ వెంట్రుకలకి నష్టం వుండదు, ఎక్కువగా తల దువ్వుకుంటూ వుండండి. రబ్బర్ ఉపయోగించవద్దు. వెనక్కి దువ్వవద్దు. పళ్లు దగ్గరగావుండే దువ్వెనలు ఉపయోగించవద్దు. నూనె బాగా రాస్తూ రెగ్యులర్‌గా షాంపుతో స్నానం చేస్తుంటే మంచిది.

ప్ర : ఒక జాడీ 'కోల్డ్‌వాక్స్' కొన్నాను. కాని, ఎలా ఉపయోగించాలో తెలియదు. క్రీమ్, లిక్విడ్స్‌కంటే కోల్డ్‌వాక్స్ మంచిదేనా ?

జ : వెంట్రుకలను తీసివెయ్యటానికి 'కోల్డ్‌వాక్స్' అన్నింటికంటే మంచిది. కోల్డ్‌వాక్స్ వెంట్రుకలను పుట్టుకతో లాగి పారేస్తుంది. ఎలా చెయ్యాలో చెప్తా వినండి. (1) ఆచోట బండ కత్తిలాంటి సాధనంలో వాక్స్ రాయండి. (2) దానిమీద నూలుగుడ్డముక్క పెట్టండి. గట్టిగా నొక్కండి. వెంట్రుకలు వాలుగావున్న వైపు నుంచి కాకుండా ఎదురుగా ఒక లాగు లాగండి. మొదటిసారి కొంచెం బాధ అనిపిస్తుంది. కాని, తర్వాత తర్వాత బాగానే వుంటుంది.



ప్ర : నా కనుబొమలు బాగా దట్టంగా వుంటాయి. వెంట్రుకలు తీసివెయ్యాలంటే చాగా కష్టం. ఒక్కవెంట్రుకను లాగాలని ప్రయత్నించినా నొప్పిపుడుతుంది, అవి వూడిరావు. ఎర్రగా కందిపోయి వాచి పోతుంది. ఏం చెయ్యమంటారు ?

జ : కనుబొమలమీద కొంచెం బూడిద రాయండి లాగితే ఇట్టే వూడివస్తాయి. 'ట్వీజర్లు' ఉపయోగించండి. మీకు చేత కాకపోతే మీ స్నేహితురాల్ని అడిగి చూడండి ఇంత్రచేసినా మీ శరీరం కందిపోతే-కోల్డ్ క్రీమ్ ఏదన్నా పట్టించండి, మంటపోతుంది.

ప్ర : రెప్పలమీద వెంట్రుకలు రాలి పోతున్నాయి. ఆపడానికి ఏదన్నా సదుపాయం వుందా?

జ : వేసలిన్‌గాని, ఆముదంగాని రాయండి, పడుకోబోయే ముందు ఇలా రాసుకుంటే వెంట్రుకలకి బలం వస్తుంది. దట్టంగా కూడా పెరుగుతాయి. కాని, కొంచెం టైంపడుతుంది. వెంట్రుకలన్నీ రావటానికి తేడా కనిపించాలంటే కొన్ని నెలలు వేచి చూడాలి. ●

ల్యూర్‌ను గూర్చి తెలుసు కొండి

అక్క!
వెండ్రుకలను తీసేది
ఏదయినా ఉందా?

ఆ! ల్యూర్ కోల్డు వాక్స్
వెండ్రుకలను మొదలంట
తీసేస్తుంది.




Creative Unit-770.*Tel.*

ల్యూర్ కోల్డు వాక్స్, అనవసరమైన వెండ్రుకలను, శుభ్రంగా మొదలంట తీసేస్తుంది. క్రిములు, రేజర్లు లా కాదు. వరుసగా వాడితే, ఇది వెండ్రుకల పెరుగుదలను తగ్గించేసి, ముతక వెండ్రుకలను పోగొట్టి మీ చర్మాన్ని నున్నగా ఉంచుతుంది. ప్రోడక్ట్ ల్యూర్ కోల్డు వాక్స్.




ఏ. కృష్ణ, విజయవాడ.

నిద్రలోనడిచే అలవాటు నాకు వున్నది. దీనిని పోగొట్టటానికి ఏం చేయ్యాలి?

* ఈ అలవాటును 'సోంనాం బులిజమ్' అంటారు. ఇది సాధారణంగా చిన్నవారిలో వుంటుంది. మానసికంగా తృప్తిచెందక, తీరని కోరికలు మనస్సును వేధించు చున్నప్పుడు, తనవారినుంచి విడదీయబడినప్పుడు, ఆ కోరికలు కలల రూపంగా తృప్తినివ్వ వచ్చును. ఇది ఎక్కువగా వున్నప్పుడు, ఆకోరికల ఫలితంగా నిద్రావస్థలో లేచి నడవటం జరుగుతుంది. ఆ సమయంలో ఎవరైనా ప్రశ్నలు వేస్తే టూకీగా సమాధానం చెప్పటం జరుగుతుంది. ఎంతదూరం నడిచినా మెట్లెక్కినా, తిరిగి యధాస్థానానికివచ్చి మరల నిద్రపోతారు.

ఇటువంటి వారికి సైకియాట్రిస్టుల సహాయం అవసరం.

యం. రాజేశ్వరి, తిరుపతి.

'కన్‌వల్‌షన్స్' అంటే ఏమిటి? మా పాపకు సం॥ 4 నెలలప్పుడు ఈ జబ్బు వచ్చి తెలివి తప్పింది. మాట కూడా పోయింది. దీని నివారణోపాయం ఏమిటి?

* ఫిట్లు రావటం చాలా కారణాలవల్ల జరుగుతుంది. చిన్నపిల్లలలో మెదడు వాయటం (ఎన్‌కెఫలైటిస్) దానిమీది పొరవాయుటం (మెనింజైటిస్), సెరిబ్రల్‌పాల్సీ, ఎపిలెప్సీ మెదడులో కొత్తగా కండ పెరగటం కొన్ని కారణాలు మీ పాపకి మెనింజైటిస్ వచ్చి వుండవచ్చును. ఇలా రావడానికి సూక్ష్మ క్రిములు, టి. బి, కొన్ని వైరస్‌లు కారణాలు. నిపుణులైన వైద్యులచేత ట్రీట్‌మెంట్ ఇప్పించటం, ఫిజియోతేరపీ (వ్యాయామము) మీ పాపకి చాలా అవసరం.

జి. రామారావు, ఖరగ్‌పూర్.

శరీరంలో కొంతభాగంలో గిల్లినా కూడా స్పర్శ తెలియక పోవటానికి కారణమేమిటి? ఇది మందులవల్ల తగ్గుతుందా?

* శరీరంలో ఎక్కడైనా చర్మంమీద తెల్లని మచ్చలు, స్పర్శలేకుండా వుండటం సాధారణంగా కుష్ఠురోగలక్షణమే అయినా ఇతర కారణాలవల్ల కూడా ఇలా జరుగవచ్చును. చర్మవైద్యులు—ఈరోగం కుష్ఠు అవునాకాదా అని నిర్ణయిస్తారు.

ఒకవేళ కుష్ఠురోగమని తేలినాకూడా 'డాప్సోన్' మాత్రలు వైద్యసలహాప్రకారం వాడటంవల్ల, వ్యాధిని అరికట్ట గలుగుతారు. ఈ మాత్రలు చాలా సం॥ లు వాడవలసి వుంటుంది. ప్రస్తుతం నిపుణులు, రోగితో మసలినవారికి కూడా ముందు జాగ్రత్తగా ఈ మాత్రలు వాడుతున్నారు.

అప్పారావు, జమి (విశాఖపట్నంజిల్లా)

నేను కుష్ఠువ్యాధిగల ఒకరి అమ్మాయిని వివాహము చేసుకోదలచాను. ఆ అమ్మాయికి ఈరోగం వచ్చేఅవకాశము వున్నదా? ఒకవేళ వివాహము చేసుకొంటే మా పిల్లలకి కూడా వస్తుందా?

*కుష్ఠువ్యాధి ఒక అంటురోగమే అయినా ఆరోగం ఇతరులకు రావటం చాలా ఏండ్లు కలిపివుండటం, రోగతీవ్రత, అనే విషయాలపై ఆధారపడి వుంటుంది. లెప్రోమాటస్ లెప్రోసి, కొంతవరకూ ట్యూబర్క్యులాయిడ్ లెప్రోసీ, ఎక్కువగా ఇతరులకు వచ్చే అవకాశము ఎక్కువ.

ఈ రోగం బయటపడటానికి చాలా సం॥ లు పడుతుంది. అందువల్ల ప్రస్తుతం పరీక్షచేయించినా లాభము వుండదు ఇక పుట్టబోయే సంతానమునకు రావటం ముఖ్యంగా తల్లిదండ్రులకు రోగం వుండటాన్నిబట్టి ఆధారపడి వుంటుంది

వి. శ్రీ వల్లి, ఆదోని

మా అబ్బాయికి 10 సం॥ లు 3 సం.ల వయస్సులో కామెర్లువచ్చి తగ్గినది. తర్వాత ఉబ్బసముతో బాధ పడుతున్నాడు. ఎన్ని మందులు వాడినా తాత్కాలికంగానే పని చేస్తున్నాయి.

* కామెర్లు — ఉబ్బసము వేర్వేరు రోగాలు. కామెర్లు వైరస్‌వల్ల వస్తుంది. ఉబ్బసం—అలర్జీవల్ల వస్తుంది. ఆహార పదార్థములలోగాని, వాతావరణంలోగాని, దుమ్ము మొదలగు వాటివల్లగాని. 'అలర్జన్లు' (అంటే శరీరానికి పడనివి) శరీరంలో ప్రవేశించవచ్చును. ఇలా జరిగినప్పుడు శరీరంలోని నిరోధక శక్తులు పనిచేయుటంవల్ల ఇలా ఉబ్బసం వస్తుంది. కొందరికి చర్మంమీద దద్దుర్లురావటం, కొందరికి జలుబు, కొందరికి ఆస్తమా, ఇలా పలురకాలుగా, శరీరం వీటిపట్ల నిరసన చూపుతుంది. కారణాన్ని కనుగొని 'అలర్జీ క్లినిక్'లలో వైద్యం చేయించాలి. అప్పుడే రోగం నయమవటానికి అవకాశము వున్నది, రోగం వచ్చినప్పుడు మందులు వాడితే అవి తాత్కాలికమే !

సి. నిరంజనీరావున్—బెంగుళూరు—55.

కొన్నిరోజుల క్రితం నాకు ఒక ఆడపిల్ల పుట్టింది. డాక్టర్లు, కడుపులో ఎక్కువ రోజులు వున్నదని చెప్పారు (పోస్టుమెచూర్) ఈపాప పుట్టిన గంటకల్లా చనిపోయింది. ఇద్దరు పిల్లల తర్వాత 6 సం. కు ఈపాప కలిగింది. 'మీకు టాక్సీమియా వుండటం వల్ల ఇలా అయింది' అన్నారు అలా అంటే ఏమిటి ?

* టాక్సీమియా అంటే గర్భవతిగా వున్నప్పుడూ, కాళ్లలో నీరుచేరటం, మూత్రములో 'ఆల్బుమిన్' వుండటం, బ్లడ్ ప్రెషర్ ఎక్కువ అవటం. ఈమూడు లక్షణాలకీ కలిపి 'టాక్సీమియా' అంటారు.

కొందరికి ఈ లక్షణాలతోబాటు ప్రసవ సమయంలో ఫిట్లు వస్తాయి — అప్పుడు 'ఎక్లాంప్సియా' అంటారు. ●

# చూడండి
# మామూలు పంపు నీటినుండి కల్మషములను ఫిల్టరుచేసి ప్యూరిటాస్ దానిని త్రాగుటకు ఎలా 100% సురక్షితము చేస్తుందో.

కలరా, టైఫాయిడ్, రక్తవిరేచనములు,
గాస్ట్రో-ఎంటెరైటిస్ మొదలైన నీటి ద్వారా సంక్రమించే
జబ్బులు రాకుండా ఇంతకంటె మరో మంచి హామీ లేదు.






ప్యూరిటాస్ తేలికైన, పగులని. ఒక చోట నుండి మరొక చోటికి తీసుకు పోవటానికి అనుకూలమై, శుభ్రపరచుటకు వీలైనది.



**నేడే ఒక ప్యూరిటాస్ తీసుకోండి మీకు ఆప్తులైన వారి కోసం వాడదగినది.**

ఉచిత చిన్న పత్రిక ... ఈ క్రింది అడ్రసుకు వ్రాయండి.

**బల్సారా**
—సౌఖ్యమైన జీవనానికి అధునాతన సాధనాలు

BALSARA బల్సారా అండ్ కంపెనీ (ప్రై.) లి.
... —400 001.

CHAITRA-BLS 19 TEL

# వదిన మనసు

## శ్రీమతి ప్రభావతీ నారాయణరావు



✷ 'అనూ! ఏడయింది లేయింక!' అంటూ తట్టి లేపాడు వేణుగోపాల్.

బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ లేచింది అనూరాధ.

'ఈ రోజు నుంచి మీ వదినగారు ఉద్యోగానికి వెళ్ళబోతున్నారు. యింక యింటి బాధ్యంతంతా మీదే రాధమ్మగారు!' అన్నాడు పరిహాసంగా.

మొహం కడుక్కోడానికి వెళుతూ వదిన గారి కోసం చూసింది అనూరాధ.

జయంతి అప్పుడే స్నానం చేసి వంటింట్లో ఏదో పని చేస్తోంది.

యిక రోజూలాగా తను వదిన మాట్లాడు కుంటూ కూర్చోడానికి వీలుండదు. ఉద్యోగం చేస్తే వదిన మారిపోతుందేమో! ఆలోచిస్తూ మొహం కడుక్కోవడం పూర్తి చేసింది.

వంటింట్లోకి వచ్చిన అనూకి కాఫీ అందించింది జయంతి. మాట్లాడకుండా అందుకుంది.

తొమ్మిది అయేసరికి జయంతి, వేణు గోపాల్ భోజనం చేసి యింట్లోంచి బయలు దేరారు. జాగ్రత్తగా వెళ్ళిరామ్మ అంటూ సాగనంపింది? అత్తగారు కామేశ్వరమ్మ.

వెళ్ళొస్తామ అనూ! అంటూ బయటకు నడిచింది జయంతి. రోజూ అయితే వేణు గోపాల్ ఆఫీస్‌కు వెళ్ళగానే అనూ, జయంతి కబుర్లు చెప్పుకుంటూ యిద్దరూ చెరొక పని చేసుకునేవారు. వదిన సాయంత్రంగాని రాదు. అప్పటిదాక తను ఒక్కతే. అమ్మ వుందన్న మాటేగాని ఎక్కువగా మాట్లాడదు. ఏదో చదువుకుంటూ కూర్చుం టుంది.

'తొందరగా స్నానం చేయి భోజనం చేద్దాం!' అంది కామేశ్వరమ్మ.

ఆలోచనల్ని కట్టిపెట్టి స్నానం చేయ డానికి వెళ్ళింది అనూ. భోజనం చేస్తు న్నంతసేపు వదిన గురించి ఆలోచనలేక అన్నం కూడా సరిగా తినలేక పోయింది.

రోజూ తను, వదిన, అమ్మ కలిసి భోంచేసేవారు. అమ్మ ఎక్కువగా మాట్లా డక పోయినా, వదిన తను కబుర్లు చెప్పు కుంటూ గంటసేపు చేసేవారు.

మధ్యాహ్నం ఆదివారం పత్రిక చదివింది కాసేపు నిద్రపోయి లేచింది ఎలాగో సాయంత్రం అయింది.

జయంతి యింటికి వచ్చేసరికి ఐదయింది. తొందరగా ముఖం కడుక్కొని రా వదినా టిఫిన్ తిందాం అంది అనూ యిల్లు వూడవడం పూర్తి చేస్తూ. నవ్వుకుంటూ బాత్‌రూంలోకి నడిచింది జయంతి. అప్పుడే వచ్చాడు వేణుగోపాల్. అతనుకూడా ముఖం కడుక్కొని వచ్చేసరికి నలుగురికీ టిఫిన్ ప్లేట్లలో పెట్టి తీసుకువచ్చింది అనూ.

టిఫిన్‌కని అందరికీ కాఫీయిచ్చి వంట మొదలు పెట్టింది జయంతి. కూర తరిగింది అనూ.

వారం రోజులు గడిచాయి. యిదివరకున్నంత బాధలేదు అనుకి. కొద్దిగా అలవాటయింది.

జయంతి కాపరానికి వచ్చేసరికి అనూ తొమ్మిదోతరగతి పరీక్షలు వ్రాసింది. యమ్. ఏ. చదివిన జయంతిని చూసి వీటువంటి మనస్తత్వమో అనుకుంటూ చనువుగా మాట్లాడలేకపోయింది అనూ! కాని జయంతే చనువుగా మాట్లాడడం మొదలు పెట్టింది. 'నేననుకున్నట్లు కాదు వదిన చాలా మంచిది' అనుకుంది అనూ. ఎలాగో టెన్త్‌క్లాస్ పాసయింది. యింక చదువుకోవాలనిలేదు అంది అనూ! జయంతి వేణుగోపాల్ అభ్యంతరం చెప్పలేదు.

అప్పుడే ఏదో ఉద్యోగానికి అప్లై చేసింది జయంతి. మూడునెలల్లో ఉద్యోగం వచ్చేసింది.

ఆరోజు మధ్యాహ్నం కూర్చుని దిండు గలేబుమీద డిజైన్ కుడుతుంది అనూ. గేటు చప్పుడుకు తలెత్తిచూసింది. నవ్వుతూ లోపలకు వచ్చింది ఆ అమ్మాయి.

'నాపేరు రాజ్యం అండి' మీ యింటి మంచి మూడో యింట్లో వుంటున్నాం క్రొత్తగావచ్చాం. ఏంతోచక యిలావచ్చాను' అంది తనను పరిచయం చేసుకుంటూ.

కూర్చోండి అంటూ కుర్చీ చూపించింది అనూ.

రాజ్యం తనంత తను రావటం వింత అన్పించినా తనపేరు అదీ చెప్పి మామూలుగా మాట్లాడింది.

'ఏమైనా పుస్తకాలు వుంటే యివ్వండి' అని అడిగింది రాజ్యం.

రెండు పుస్తకాలు తెచ్చియిచ్చింది అనూ.

రేపు మధ్యాహ్నం వస్తానండి అంటూ వెళ్ళిపోయింది రాజ్యం.

రోజూ మధ్యాహ్నం పూట. వచ్చేది రాజ్యం. అనూ, రాజ్యం ఒకరిని ఒకరు మవ్వు అని పిలుచుకునే చనువు ఏర్పడింది.

రాజ్యం స్నేహంతో అనూకి వదినగారి గురించిన ఆలోచనలు పూర్తిగా తగ్గిపోయాయనే చెప్పాలి.

రాజ్యం వదినగారు కూడా ఉద్యోగం చేస్తుందిట. ఆవిడకు ఒక కొడుకు కూడా వున్నాడుట. సాయంత్రం ఆవిడ వచ్చేవరకు ఆ అబ్బాయిని రాజ్యం, వాళ్ళమ్మ చూస్తూ వుండాలి. రాజ్యం వాళ్ళొదిన యింట్లో వున్నంతసేపు పనికూడా చేయదుట. రాజ్యానికి ఆవిడంటే చాలాకోపం.

ఆవిడ రాజ్యానికి సాదాబట్టలు కొని ఆవిడ మంచిచీరలు కొనుక్కుంటుందిట. శలవురోజున వాళ్ళన్నయ్య వదిన కలసి సినిమాకు వెళతారట. రాజ్యాన్ని వాళ్ళమ్మని నాలుగునెలలకు ఒకసారి సినిమాకు పంపిస్తారుట.

అన్నీ చెప్పి 'మీ వదినా అంతేనా!' అని అడిగింది ఒకసారి.

నవ్వి వూరుకుంది అనూ.

'వదినెలందరూ అంతేలే! అంది రాజ్యం మళ్ళీ.

'మనం వదినలమైతే?' అంది నవ్వుతూ అనూ!

ఆ ప్రశ్నకు తెల్లబోయింది రాజ్యం.

'అనూ! నాలుగు దాటింది యిల్లు వూడ్చేయి. వదిన వచ్చే వేళయింది' అంది లోపల్నుంచి కామేశ్వరమ్మగారు.

'యింక నేను వెళ్తాను అనూ!' అంటూ వెళ్ళిపోయింది రాజ్యం.

'తొందరగా కాని' అంటూ చీపురు అందించి టిఫిన్‌చేయడానికి వెళ్ళింది తల్లి.

విసుక్కుంటూ చీపురు తీసుకొని యిల్లు వూడవడం మొదలుపెట్టింది అనూ!

యిల్లు వూడ్వడం అంటే చిరాకు అనూకి.

యిదివరకు రెండుపూట్లా జయంతే ఊడ్చేది.

ఈమధ్య వేణు రాత్రి పొద్దు పోయి వస్తున్నాడు.

రాత్రిపూట జయంతి భర్త వచ్చిన తరువాతే భోజనంచేస్తానవటంతో, అనూ, కామేశ్వరమ్మగారు భోంచేసి పడుకునేవారు. జయంతి. వేణు భోజనంచేసేసరికి పొద్దుపోయేది. భోజనం తరువాత వంటిల్లు శుభ్రంచేసి పడుకునేసరికి మరింత పొద్దుపోయేది. ప్రొద్దున్నే లేవలేకపోయేది. ఏడు దాటేది.

ఆరోజు పెందరాళే మెళుకువ వచ్చింది. అనూకి. లేచి టైముచూస్తే ఆరయింది. బాత్‌రూంలో అంట్లు తోముతోంది కామేశ్వరమ్మ. యిదివరకయితే వదిన ఆరింటికల్లాలేచి పాచిపనిచేసి, అంట్లుతోమేది. తల్లి లేచి బాయిలర్ అంటించి కాఫీత్రాగి స్నానం చేసి వంట మొదలుపెట్టేది. ఈ మధ్య వదినగారు ఆలశ్యంగా లేవడంతో అన్నిపనులు కామేశ్వరమ్మే చేసుకోవడం మొదలు పెట్టింది.

'మొహం కడుక్కురా!' అంటున్నా వినిపించుకోకుండా తోమిన అంట్లన్నీ కడిగి వంటింట్లో సర్ది వచ్చింది. ఆ క్షణంలో తల్లిని చూస్తే జాలేసింది అనూకి.

'రేపటినుంచి నీవు లేచినప్పుడు నన్ను కూడా లేపమ్మా!' అంది తల్లితో.

యిదివరకు అంటే వదిన ఉద్యోగంలో చేరకముందు పనిమనిషిని పెట్టుకుందాం అనుకుంటే అంట్లు పాచి పనికి పదిహేను రూపాయలు అడిగింది. బట్టలు ఉతకవంద్కు సరేనని ఒప్పుకుంటే అది పనిచేసిన వారం రోజుల్లో రెండు వస్తువులుపోయాయి. ఎవరి బట్టలు వాళ్ళు ఉతుక్కుంటున్నాం. ఈ కాస్త పని చేసుకోలేమా? పైగా దొంగతనాలు భరించలేం. అంటూ పని మనిషిని మాన్పించేసింది తల్లి.

వదినంటే రాజ్యం చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. మనం వాళ్ళమీద ఆధారపడ్డామనే వాళ్ళు అలా ప్రవర్తిస్తారు అంది రాజ్యం ఒకసారి.

నిజమే నన్పించింది అనూకి. వాళ్ళమీద ఆధారపడకుండా తను చదువుకుని ఉద్యోగం చేసుకోవాలి కాని తనకు చదువుమీద అట్టే శ్రద్ధలేదు. ఎలాగో మామూలు మార్కులతో టెన్త్‌క్లాస్ పూర్తి చేసింది.

కాఫీ త్రాగేసి అలాగే ఆలోచిస్తూ కూర్చుంది అనూ. ఏపనీ చెయ్యాలన్పించలేదు. అప్పుడే లేచి ముఖం కడుక్కొ వచ్చింది జయంతి. కాఫీ కలుపుకుని త్రాగింది. గదులు ఊడ్చేసి అత్తగారికి కూరలు అవీ అందించి భర్తనులేపి స్నానం చేసివచ్చింది. గబగబా టిఫిన్ తయారుచేసి రెండు టిఫిన్‌లలోను సర్ది ఒక ప్లేటులో పెట్టి అనూకి యిచ్చింది.

'వద్దు తినాలని లేదు' అంది ముభావంగా.

ఎప్పుడూ అలా అనని అను 'వద్దు వదినా!' అంటుంది గారంగా. తిందూ!

అంటూ నవ్వుతూ బలవంతం చేస్తుంది తాను.

'ఏదో ఆలోచిస్తున్నట్లున్నావు తిను కొద్దిగానే!' అంటూ మంచినీళ్లు కూడా అక్కడ పెట్టి వంటింట్లోకి వెళ్లిపోయింది.

అనూలో మార్పు గమనించింది జయంతి. అయినా ఏమీ తెలియనట్లుగా వుండిపోయింది.

'అమ్మా ఎందుకింత కష్టపడతావు? అందరినీ సుఖపెడుతూ!' అంటూ విసుక్కునేది తల్లిమీద.

'తప్పు ఏమిటా మాటలు!' అంటూ మందలించింది కామేశ్వరమ్మ. ఆవిడకు మాటల్లో చెప్పకపోయినా మనసునిండా వుంది అభిమానం 'నీఖర్మ!' అని మనసులో అనుకుంది అనూ.

రాజ్యంతో స్నేహం పెరిగిన కొద్దీ జయంతితో మాట్లాడడం తగ్గించింది అనూ. జయంతే పలకరిస్తే సమాధానం చెప్తుంది. తనంతట తను మాట్లాడ్డం మానేసింది.

* * *

'ఆరోజు రోజాకంటే పెందరాళే యింటికి వచ్చాడు వేణు. వస్తూనే 'అనూ! అనూ!' అంటూ పిల్చాడు గట్టిగా. డాబామీద రాజ్యంతో కబుర్లు చెప్తున్న అనూ కిందకి వచ్చింది.

అన్నగారి చేతిలో ప్యాకెట్లు వంక ఆశ్చర్యంగా చూస్తూ 'ఏమిటన్నయ్యా!' అంది.

'వెనకనే వచ్చిన రాజ్యం యింక నేను వెళ్తాను అనూ!' అంటూ గబగబా వెళ్ళిపోయింది.

అక్కడే సోఫాలో కూర్చుని పత్రిక చదువుకుంటున్న తల్లి ప్రక్కన కూర్చుని ప్యాకెట్లు విప్పాడు వేణు.

'యిది అనూకి. యిది జయకి, యిది నీకు' అంటూ మూడు చీరలుతీసి అందించాడు.

రెండు ఫారెన్ జార్జెట్ చీరలు. ఒకటి ఎరుపురంగుకి తగ్గ జరీ బార్డర్ అది అనూకి, రెండవది తెలుపు నీలంపు జరీబార్డర్ అది జయంతికి, తల్లికి వెడల్పాటి జరీఅంచున్న తెల్ల చీర.

'ఎలా వున్నాయి!' అని అడిగాడు వేణు.

'చాలా బాగున్నాయి' అన్నారు యిద్దరూ.

రెండు రోజుల క్రితం వాళ్ల ఫ్రెండ్ ఒకతను అలాంటి చీర కొన్నాడట వాళ్ల మిసెస్‌కి. బార్డర్ కుట్టమని యిచ్చాను తీసుకొద్దాం రావోయ్ అని వేణుని కూడా తీసుకెళ్లాడట. ఆ చీర చూడగానే తనకు కూడా కొనాలనిపించిందిట. వెంటనే రెండూ సెలక్ట్‌చేసి బార్డర్స్ కట్టమని యిచ్చాడట. ఒక్కొక్క చీర నూటయిరవై దాకా అయింది అన్నాడు వేణు.

'అమ్మో! బాబోయ్!' అనుకుంది అనూ మనసులో.

జయంతి యింటికి వస్తూనే తల నెప్పిగావుంది అంటూ పడుకుంది. చీరలు తీసి చూపించాడు వేణు. బాగానే వున్నాయి అని ప్రక్కన పెట్టేసింది జయంతి.

జయంతి ముఖంచూసి చాలా సంతోష పడుతుందనుకున్న వేణు నిరుత్సాహ పడ్డాడు.

ఆరోజు రాత్రి నిద్రలోంచి లేచి మంచి నీళ్లు తాగడానికి వంటింట్లోకి వెళుతున్న అనూ అన్నయ్య వదినల గదినుంచి విని పిస్తున్న సంభాషణ విని ఆగిపోయింది.

'అంతంత ఖరీదు పెట్టి ఎవరు కొన మన్నారు మిమ్మల్ని?' అంది జయంతి.

'బాగున్నాయి కొనాలనిపించింది కొన్నాను అంతే!' అన్నాడు వేణు.

'వెనకా ముందు ఆలోచించక్కర్లేదు. నాతో అంటే ఏం పోయింది?' నాన్న పరిస్థితులు బాగోలేవట. తరువాత యిచ్చే స్తాను ఏదైనా సర్దమని వ్రాశాడు. యిప్పుడేం చేయాలి? ముందు చీరలు కొనే శారు' అంది కొంచెం కోపంగా.

నీ జీతంలోంచి పంపు అన్నాడు వేణు.

'నా జీతం వేరేదానికోసం దాంట్లోంచి ఒక్క పైసా తియడానికీ వీల్లేదు' అంది జయంతి.

'యింకేం మాట్లాడలేదు వేణు.

నెమ్మదిగా వంటింట్లోకి వెళ్లి మంచి నీళ్లు త్రాగివచ్చి తల్లి ప్రక్కన పడుకుంది అనూ. కాని నిద్రరాలేదు. వదిన మాటలే గుర్తుకువచ్చాయి. అంటే వదిన జీతంఅంతా బాంక్‌లో వేస్తోందన్నమాట. తనకు చీర కొనడం యిష్టంలేదన్నమాట. కళ్లనీళ్లు తిరిగాయి. తన అనుమానం నిజమయింది. వదిన పూర్తిగా మారిపోయింది. ఆలోచ నలలో తెల్లవారుజామున నిద్రపట్టింది అనూకి.

మర్నాడు రాజ్యం చెప్పగా తెలిసింది వాళ్లొదిన కాంతం తన జీతం అంతా బాంక్‌లో దాచిందిట. అది పెట్టి తనపేర స్థలం కొనుక్కుంటోందిట. ఆమాట విన గానే జయంతికూడా అలాటి పనేచేస్తుం దేమో అనిపించింది అనూకి. తనుకూడా చదువుకుంటే ఉద్యోగంచేసేది కాని యిష్ట



దేమనుకుని ఏరలోభం అనుకుంది అనూ.

'ఏమిటి ఆలోచిస్తున్నావు?' అంది రాజ్యం.

'ఏంలేదు ఈ వదినలందరూ యిలా ఎందుకు తయారవుతారో?' అంది విట్బ్హూరుస్తూ.

గట్టిగా నవ్వి 'సరే కాని! సినిమాకు తీసుకు వెళ్ళరాదు. మీ అన్నయ్య మంచి వాడే. అడిగితే ఏమీ అనడు. మా అన్నయ్య సరిగ్గా మాట్లాడను కూడా మాట్లాడడు తన కేంప్‌లు తన గొడవ తనదే ?' అంది రాజ్యం.

ఉండు మా అన్నయ్యకు ఫోన్ చేసి చెప్తాను అంటూ తల్లి పర్మిషన్ తీసుకొని పక్కింటినుంచి ఫోన్‌చేసింది అనూ.

'దానికేం వెళ్ళిరండి అమ్మనడిగి డబ్బులు తీసుకు వెళ్ళు. జాగ్రత్త!' అంటూ ఫోన్ పెట్టేశాడు వేణు.

ఆరోజు మ్యాట్నీ చూసివచ్చారు రాజ్యం, అనూరాధ. ఆ తరువాత అలా చాలాసార్లు వెళ్ళారు యిద్దరు. యిది చూసి వదిన ఈర్ష్యపడాలి అనుకునేది అనూ. కాని జయంతిలో అటువంటి భావం కన్పించక ఆశ్చర్యపడింది.

మందులు వాడుతున్న వదినగార్ని చూసి 'అలావుంటోందేం వదినా!' అని అడిగింది తల్లిని.

ఆవిడ నవ్వుతూ 'అత్తవవుదువుగాని త్వరలోనే!' అంది.

అర్థంచేసుకున్న అనూ ఏం మాట్లాడలేదు. అలానే వెళ్ళిపోతోంది జయంతి. జయంతి ఉద్యోగంలోచేరి సంవత్సరం దాటింది. ఆరునెలలు నిండాయి మనిషి యిదివరకటికన్నా అందంగా కన్పిస్తోంది.

అంతకు ముందులాగానే అనుకోకుండా అన్నయ్య వదినల సంభాషణ వింది అనూ.

'యిదిగో రేపు ఉద్యోగానికి రాజీనామా పంపిస్తున్నాను!' అంది జయంతి.

ఆశ్చర్యంగా 'ఏం !' అన్నాడు వేణు.

'నేనుకున్నది పూర్తయింది యిదిగో!'

'బాంక్ ఎకౌంట్ నాలుగువేలు !' అన్నాడు వేణు.

'ఎందుకో తెలుసా?' అంది నవ్వుతూ జయంతి.

'ఆ జంతట నీవు చెప్పాలి; కాని నేరద నేను వదే నాకిష్టం !' అన్నాడు వేణు.




చాలామంది మహామునులు తమకు శపించడానికీ, తిరిగి అనుగ్రహించడానికీ కూడా తగిన శక్తిసామర్థ్యాలున్నా, అంతతో తృప్తి చెందరు. నిరంతరమూ తపస్సు ఆచరిస్తూనే ఉంటారు. తపస్సు చేయడం అసాధ్యమనేది అందరికీ తెలిసినదే! తమకు ఇంతో సామర్థ్యం ఉండికూడా మునులు తపస్సు చెయ్యడాన్నిబట్టి ఆ తపస్సులో అద్భుతమైన శక్తులు ఉన్నాయని ఒప్పుకోక తప్పదు.

'యద్దుష్కరం యద్దురాపం
యద్దుర్గం యచ్చ దుస్తరమ్
తత్ సర్వం తపసా ప్రాప్యం
తపో హి దురతిక్రమమ్.'

చేయుటకు సాధ్యం కాని పని ఏదిఉన్నదో, పొందశక్యం కాని పదార్థం ఏది ఉన్నదో, చేరశక్యం కాని స్థలం ఏది ఉన్నదో, దాటశక్యంకానిది ఏది ఉన్నదో — సమస్తమూ తపస్సువల్ల సుసాధ్యం కాగలదు. ఏమంటే— తపస్సునకు తిరుగులేదు—అని దీని అభిప్రాయం.

తపస్సుకు భేదభావం లేదు. దేవతలు దాన్ని ఆచరించినా, దానవులు ఆచరించినా, మనుష్యులు మున్నగువారు చేసినా సరే అది పక్షపాతం లేకుండా ఫలాలనిస్తుంది. ఆ తపస్సునకు తృప్తిపడి భగవంతుడు వరాలివ్వ తీరవలసినదే! రాజర్షి అయిన విశ్వామిత్రుడు వసిష్ఠమహామునితో సమానంగా 'బ్రహ్మర్షి' అనిపించుకోడానికీ, సృష్టికి ప్రతిసృష్టి చేసి మూడులోకాలనూ కల్లోలపరచడానికీ సాధనం తపస్సే కదా! రావణుడు మానవేతరులచేత చంపబడకుండా ఉండడానికి కారణం అతని తపస్సే కారణం!

ఇంత ఎందుకూ? మహాసమాధినిష్ఠుడై మన్మథుని భస్మంచేసి నిరీహుడైన పరమేశ్వరుణ్ణి పార్వతీదేవి స్వాధీనం చేసుకుని, అతని శరీరంలో అర్ధభాగంగా ఉండిన దంటె — అది తపః ప్రభావమే కదా!

ఇలా ఎన్నయినా ఉదాహరణలు చెప్పవచ్చును.

ఈ కారణం వల్లనే 'తపో హి దురతిక్రమం' అని పెద్దలు అన్నారు. ●

## వదిన మనసు

అందుకనే నేనే చెప్తున్నాను వినండి.

'అనూ ఒక్కతే మీకు చెల్లెలు పెళ్ళి చేయాలా? పెళ్ళికి కావాలంటే కట్నం ఇచ్చినా ఇవ్వకపోయినా సంసారానికి సరిపడ సామానుతోనైనా పంపించాలా. అంటే పదివేలు కావాలి. ఏ వయసులో అది జరిగితే బాగుంటుంది. అనూకి వచ్చే సంవత్సరం పెళ్ళిచేస్తే బాగుంటుంది, అనూ నాకు చెల్లెలులాంటిది. తను నన్ను ఏ విధంగా అనుకున్నా నాలో మార్పురాదు. నా బాధ్యత నేను నెరవేర్చాలనుకున్నాను. అనూ పెళ్ళి ఖర్చులకి కొంతైనా నేను సంపాదిస్తే బాగుంటుందనే ఉద్యోగంలో చేరాను. మీకు నెలకు ఆరువందలు వస్తున్నా ఖర్చులకుపోను నాలుగు సంవత్సరాలనుంచి దాచినదానిని కలిపితే మనం ముఖ్యంగా నేను అనుకున్నట్లు అనూ పెళ్ళి ఘనంగా చేయొచ్చు' అంది జయంతి.

ఆశ్చర్యపోయాడు వేణు.

'సరేకాని రేపటినుంచి వరుడుకోసం వెతకండి అబ్బాయిగారూ' అంది చిలిపిగా.

'నిజంగా నేనెంత అదృష్టవంతుణ్ణి' అన్నాడు జయంతిని దగ్గరకు తీసుకుంటూ.

'కాదు నేనే అదృష్టవంతురాల్ని. మీ లాంటి భర్త, తల్లిలాంటి అత్తగారు, చెల్లెలులాంటి ఆడపడుచు ఎవరికి మాత్రం దొరుకుతారు!' అంది తృప్తిగా వేణు గుండెలమీద తలఆన్చి.

అంతవరకువిన్న అనూ యింక నిలబడలేనట్టు వెళ్ళి పక్కమీద వాలిపోయింది. ఛీ తనెంత అసహ్యంగా ఆలోచించింది. వదిన మనసెంత తియ్యనిది. అసలు తనెలా ఆలోచించగలిగింది? వదినని క్షమించమని అడగాలి కన్నీళ్ళతో తలగడ తడిపివేసింది.

మర్నాడు ఉదయం అనూ జ్వరంతో లేవలేకపోయింది. జయంతే అనూని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళింది. మందులు తీసుకు వచ్చింది. ఆ మూడురోజులు అనూ మంచం ప్రక్కనే పడుకుంది. జయంతి మందులు అన్నీ యిచ్చింది. మూడోరోజు కొద్దిగా జ్వరం తగ్గింది. మంచంమీద తనప్రక్కనే కూర్చున్న జయంతిని చూసి 'వదినా నన్ను క్షమించవు!' అని అడిగింది అనూ.

'ఛీ! మనలో మనకు క్షమార్పణలు ఏమిటి?' అంది జయంతి.

'లేదు వదినా నిన్ను అపార్థం చేసుకొని పిచ్చిపిచ్చిగా ఆలోచించాను' అంది అనూ.

'అది సహజం నిన్నెప్పుడూ నేను ప్రేమిస్తాను. ఏమనుకున్నా మనస్సులో నున్న మమత ఎక్కడకు పోతుంది. సర్దుకు పోవాలి!' అంటూ ఆప్యాయంగా కన్నీళ్ళు తుడిచింది జయంతి.

మర్నాడు ఉదయం జ్వరం పూర్తిగా తగ్గిపోయింది అనూకి. తరువాత క్రొత్త చీరలు కట్టుకుని తన కాళ్ళకు నమస్కరిస్తున్న కూతురిని, కోడలిని చూసి తృప్తిగా నిట్టూర్చిందావిడ. 'ఎప్పటికీ యిలాగే వుండాలి కలిసి' అంటూ దీవించింది. ●

# వారఫలం

**10-8-1973 శుక్రవారం మొదలు**
**16-8-1973 గురువారం వరకు**

**మేషం:—** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృషభం:—** అనవసరమైన శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. మీ కంటే పెద్దవారు కూడా కొన్ని వ్యవహారాల్లో మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**మిథునం:—** మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలో నష్టం వస్తుంది. వారం ఆఖరులో వృత్తివ్యాపారాలు బాగుంటాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కర్కాటకం:—** వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. సాంఘిక కార్యక్రమాలు బాగుంటాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**సింహం:—** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ఇతరుల నిమిత్తం మీరు శ్రమకు గురికాగలరు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:—** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి.

స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరతాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**తుల:—** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వారం ఆఖరులో ప్రయాణాలు ఫలిస్తాయి. మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలించగలవు.

స్త్రీలకు — సంతోషకరమైన సమాచారం అందగలదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృశ్చికం:—** రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో అడావుడి అధికంగా ఉంటుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**ధనుస్సు:—** వృత్తివ్యాపారాలు బాగుంటాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఇతరులతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సజ్జనసాంగత్యం లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మకరం:—** మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**కుంభం:—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితి యేర్పడుతుంది.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మీనం:—** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జనసాంగత్యం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో మీరు శ్రమపడినా ఫలితం దక్కదు.

స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరతాయి. బంధువులకు సహాయం చేస్తారు.

— మహేష్




## జరిగిన కథ

నిలయ చెల్లెలు లోక. రోగంతో తీసుకుంటున్న ముసలితండ్రి ఒకడున్నాడు. సంసారం బాధ్యత అంతా నిలయదే. ఆమె ఒక ఆఫీసులో పని చేస్తున్నది. ఆ ఆఫీసులోనే పని చేస్తున్న భాస్కరరావు ఆమెని పెళ్ళాడతానన్నాడు. కాని, కుటుంబ పరిస్థితి దృష్ట్యా నిలయ అంగీకరించలేదు. లోకకి సినిమాలంటే పిచ్చి. ఆమెకి తగిన వాడే మోహన్. సినిమాల్లో చేర్పిస్తానని లోకని మద్రాసు తీసుకు వచ్చాడు మోహన్. నిలయా మధూ ఒకరినొకరు ప్రేమించుకున్నారు. కాని మధు తల్లి అందుకు సమ్మతించలేదు. వేరే సంబంధం గురించి చెప్పింది. మధు తల్లడిల్లిపోయాడు. లోక గర్భవతి అయ్యాక మోసంచేసి వెళ్ళిపోయాడు మోహన్. జయ ఆమెకి మంచి స్నేహితురాలు. తన తండ్రితో నిలయ పార్కులో కనిపించిందని విన్నాక జయ మనసు మనసులో లేదు. సుజాత చెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు సుందర్.

---

# 11

'నేనెక్కడికీ రాను, బయట తిరగను మీతో.' అని భార్య అన్నప్పటినించీ ఆ కోపంతో రోజూ కావాలని ఒక్కడూ షికారుకో, సినిమాకో వెళ్తూనే ఉన్నాడు భాస్కరరావు. భార్య మీదా, తల్లి మీదా కూడా విపరీతమైన కోపంగా ఉంది. తన తల్లి అన్న మాట పట్టుకుని, భార్య తనతో ఎక్కడికీ రాకపోవడంతో రోజు రోజుకీ పిచ్చి కోపం, తిక్క పెరుగుతున్నాయి. ఆ కోపతాపాల్లో భార్యాభర్తలిద్దరూ ఒకరి కొకరు దూరమైపోతున్నారు. ఇంట్లో ముక్తసరిగా మాటలు తప్ప మరే సరదా లేకుండా ఉంది. వరలక్ష్మికి కూడా ఇది బాధగానే ఉంది. కానీ పట్టుదల, అభిమానం దాన్ని జయించాయి. విభిన్న అభిప్రాయాలు గల ఇద్దరు మనుషులకి నచ్చేవిధంగా ఒక మనిషి ఎలా నడుచుకోగలడు? ఒకరిలా చెయ్యమని మరొకరు అలా చెయ్యమని చెప్తే రెండు రకాలుగానూ ఒకే పనిని చెయ్యడం ఎలా? చివరకో ఒకరి పద్ధతిని అనుసరించి రెండో వాళ్ళ ఆగ్రహానికి గురికాక తప్పదు. నిజానికి కట్టుకున్న భర్త తనతో ఎక్కడికైనా రమ్మంటే రానని బాధించడం ఏ ఆడదానికీ ఇష్టం ఉండదు. పైగా సరదాగానూ, ఉత్సాహంగానూ ఉంటుంది అలా వెళ్ళడానికి. కానీ...కానీ...ఇప్పుడో...పట్టుదల, అభిమానంతో వెళ్ళకుండా కూర్చుంటోంది తను. కానీ దీనికి అంతెప్పుడు? దీని మూలంగా ఆయన తనకి దూరమైపోతున్నారే!

చెప్పులు తొడుక్కుని వీధిలోకి నడిచాడు భాస్కరరావు. చిన్నగా నిట్టూర్చి కూర్చున్న చోటునించి లేచింది వరలక్ష్మి. ఒక గమ్యం అంటూ లేకుండా నడుస్తున్న భాస్కరరావుకి హఠాత్తుగా నిలయ జ్ఞాపకం వచ్చింది. ఆఫీసులో తనతో ఇదివరకు ఎంతో చనువుగా ఉండే నిలయ ఈమధ్య చాలా రోజుల్నించీ రామనాథంగారికి చేరువై పోయింది. ఆయన ఇంటికి రాకపోకలు, ఆయనతో షికార్లు...ఇంకెవరూ దొరకనట్టు ఆ ముసలాడిని పెట్టుకొంది... పైకి అలా కన్పిస్తుంటే అన్నాళ్ళూ, నిలయ గుణం మంచిదని నమ్మాడు తను. పొరపాటు పడ్డాడన్నమాట. అప్రయత్నంగా నిలయనీ, వరలక్ష్మినీ పక్క పక్కన ఊహించుకున్నాడు. నిలయ అందమైనది. ఈమధ్య భార్యతో సుఖం కరువే అయింది తనకి. కూర్చుని సరదాగా కబుర్లు చెప్పుకుని కూడా ఎన్నాళ్ళయిందో. ఆలోచిస్తూ అప్రయత్నంగా నిలయ ఇంటివైపు నడక సాగించాడు.

తలుపు తీసి 'మీరా!' అంటూ ఏం కావాలన్నట్టు చూసింది నిలయ. చొరవగా లోపలికి అడుగువేశాడు భాస్కరరావు. 'కూర్చోండి' అంటూ కుర్చీ చూపించింది.

కిటికీలోంచి చల్లటి గాలి వీస్తోంది. అప్పుడే వెలిగించి పెట్టిన రెండు అగరొత్తులు గోడకున్న వెంకటేశ్వరస్వామి పటం దగ్గర వెలుగుతున్నాయి గదంతా సువాసనలు వెదజల్లుతూ. ఎర్రటి అంచున్న తెల్ల గ్లాస్కో చీర, ఎర్రటి జాకెట్టు, జడలో మల్లెలు...రోజూ కంటే కూడా ఎంతో అందంగా ఆకర్షణీయంగా కనపడింది నిలయ భాస్కరరావుకి. ఏవో అవీ ఇవీ మాట్లాడుతున్నాడన్న మాటేగాని అతని మనసు మనసులో లేదు. గదిలో అగరువత్తుల సువాసన, మల్లెల పరిమళం, ఎదురుగా కూర్చున్న నిలయ మొహంలో చిరునవ్వు...అతని ఎదలో ఏవో భావాలు... ప్రకృతి రగిలించే మంట శరీరంలో ... కోరిక పుట్టించే వేడి అణువణువునా, వివేకం, మానవత్వం ఆ క్షణంలో భాస్కరరావు నించి తప్పుకున్నాయి. ఆ స్థానంలో మరేదో బలీయమైన కోరిక...తనని తనే మర్చిపోయాడు భాస్కరరావు... పరిసరాలు పూర్తిగా విస్మరించాడు. కళ్ళకి ఒక్క నిలయ రూపం తప్ప మరేమీ కానరావట్లేదు. 'నిలయా!' అప్రయత్నంగా ముందుకి వంగి నిలయ చేతినందుకోబోయాడు. తెల్లబోయింది నిలయ. ఆశ్చర్యంతో నోటమాట రాలేదు. చటుక్కున కూర్చున్న చోటునించి మాత్రం లేచింది.

'ఎందుకలా భయపడతావు నిలయా!'

ఈ ఏక వచన సంబోధనకి మరింత ఆశ్చర్యమనిపించింది. కుర్చీలోంచి లేచి ముందుకి రెండడుగులు వేశాడు. అతని

కళ్ళల్లో మెరుపు, మాటల్లో కొత్తదనం నిలయని భయపెట్టాయి. 'భాస్కర్రావు గారూ!' అంది కాస్త గట్టిగా మరేమీ అనలేక.

'ఎందుకంత భయం నిలయా! నీ కేమీ కొంటెపని అలవాటుగా. ఇవాళ నిన్ను చూస్తుంటే నాకు మనసు మనసులో లేకుండా పోతోంది. ఈ అవకాశం...'

'భాస్కర్రావుగారూ!' వినుగా లేచిన నిలయ కుడిచేతిని వివేకం కిందికి దించింది. మొహం కోపంతో ఎర్రబడింది.

'నేనేం తప్పు మాట్లాడను. పైకి పరమ సాధ్విలా నటిస్తే నటించావు. నా దగ్గిర భయమెందుకు? ఆ ముసలాడికంటే తీసిపోయానా నేను.'

రామనాథంగారి ప్రస్తావించి ఆ మాట అతనన్నాడని గ్రహించుకుంది నిలయ.

'దయచేసి బయటికి నడవండి. ఇన్నాళ్ళూ ఆఫీసులో మీరొక్కరే మంచి మనిషిగా లెక్కించుకున్నాను. మీ నిజ స్వరూపం ఈరోజు బయటపడింది.'

'మాటలతో కాలం వృధా చేసుకోడమెందుకు? ఆ ముసలాడికంటే నేనేం తక్కువని! నీ కిటువంటివి కొత్త కానే కాదు. మొదట చంద్రశేఖరంగారన్నారు... తర్వాత రామనాథం... ఇలాగే ఒకొక్కరు... ఆ తర్వాత మరొకరు...'

'ఛీ! బయటికి నడవమంటున్నది మిమ్మల్నే. మరొకర్నైతే చెంపదెబ్బ రుచి చూపి ఉండేదాన్ని. మిమ్మల్ని ముట్టుకుని కొట్టడం కూడా పరమ అసహ్యంగా ఉంది నాకు. పిచ్చివాగుడు కట్టిపెట్టి బయటికి నడవండి.'

ఇక అక్కడి దగ్గిర ఓడిపోవటం, మాటలు పడవల్సి రావటం చెప్పలేని అవమానమైంది భాస్కర్రావుకి. కళ్ళల్లో కోపం, చేతకాని తనం చిందులు తొక్కాయి. తమాయించుకుని మెల్లిగా అన్నాడు 'అదికాదు నిలయా! బాగా ఆలోచించు. నీలాగే ఆఫీసులో మొదటినించి కూడా మనిద్దర్నీ కలిపి అందరూ మాట్లాడేవారు కదా! మంచిగా ఉన్నా కూడా అటువంటి నిందలు పడక తప్పనప్పుడు మంచిగా ఉండకపోతే మాత్రమేం? నాకూ ఇంట్లో భార్యతో సుఖం, ఆనందం కరువై అప్పుడే చాలా రోజులైంది. ఇంట్లో మన క్కాతలేదు. మనిద్దరినీ ఒకటిగా చూసినా... నీ అందం ఆడదికావలసిన వన్నెల తప్పు...'

'భాస్కర్రావుగారూ! మీరు మంచిగా చెప్తే ఇక్కడి నించి కదిలేలా లేరు. మెడ పట్టుకుని గెంటవల్సి వస్తుంది. మర్యాదగా ఇక్కడినించి వెళ్ళిపొండి. చంచల మనస్కులని ఆడవాళ్ళని అంటారు గానీ... అది నిజంగా కాదని మగవాళ్ళు ఆడవాళ్ళ కంటే ఈ విషయంలో దుర్బలులని మీరు ఋజువు చేశారు.'



'హు!' బాధతోనూ, అవమానంతోనూ గొంతు పెండిన కోపంతో విసురుగా బయటికి వెళ్ళాడు భాస్కర్రావు. తలుపులు గడియవేసి మంచం మీద వాలిపోయింది నిలయ. ఏడ్చి ఏడ్చి కళ్ళు ఎర్రబడ్డాయి. కన్నీటితో దిండు తడిసి పోయింది. నీ లోకాల్లోనో ఉన్న లక్ష్మీ, తండ్రిని తల్చు తల్చుకుని, తన ఒంటరి బ్రతుకుని తల్చుకుని కుమిలిపోయింది. రామనాథంగారితో అంతా చెప్పెయ్యాలని నిశ్చయించుకుంది.

తన స్నేహం మూలంగానే రామనాథంగారు నాగవేణి ఇంటికి ఇన్నాళ్ళబట్టీ వెళ్ళడం పూర్తిగా మానుకున్నారు. తను కోరుకున్నదీ ఇన్నాళ్ళనించీ ఈయన మొహం చూపించక పోవడంతో కోపం వచ్చి ఆ నాగవేణి ఈ పాటికి మరెవరినో చూసుకునే ఉంటుంది. ఇంక ఈయనతో మాట్లాడ్డానికి కూడా ఇష్టపడదు. అదే కావల్సింది. నిలకైతనం రామనాథంగారిలో చిన్న మార్పులు తీసుకురాగలిగింది తను. అప్పు కన్నీరే పెదవంచగలిగింది. ఇంటిని, పిల్లల్ని వింతో బాధ్యతగా చూసుకుంటున్నారిప్పుడు. ఇదివరకులా బలాదూర్లేమీ చెయ్యట్లేదు డబ్బు తగలెయ్యట్లేదు. తను చెప్పిన చెప్పగా నిలకైతేనం ఒక కూతురి పెళ్ళి కూడా జరిపించారు. ఎటొచ్చీ తను ఆడుతున్నది నాటకమని ఎవరికీ తెలియదు. ఆయనకి చెప్పాలని మొదట్లో వింతగా ప్రయత్నించినా ఆ అవకాశం ఇవ్వలేదు ఆయన. తర్వాత తర్వాత తనే ఊరుకుంది

ఎప్పుడో అదే తెలుస్తుంది కదా అని. అసలు సంగతి తెలియని జయ తనని పెద్దగా ఊహించుకుని అపార్థం చేసుకుంది. నిజం తెలిశాక ఎంత సంతోషిస్తుందో! ఇదంతా, రామనాథంగారిని మంచి మనిషిగా దిద్దడానికి తను ఆడిన నాటకమని తెల్సి ఎంత ఆశ్చర్యపోతుందో! ఇన్నాళ్ళబట్టీ ఏదో ఒక వంకతో కష్టపడి వీలైతేనేం రామనాథంగారిని దూరంగా ఉంచగలిగింది తను. కానీ ఇప్పుడింక రోజురోజుకీ ఆయన ప్రవర్తన చూస్తుంటే భయంగానే ఉంది. ఇంక ఏమైనాసరే సందర్భం వచ్చినప్పుడు ఓసారి ఆయనతో అంతా చెప్పేసెయ్యాలి.

* * *

ఆఫీసు నించి ఇంటికి రాగానే 'పార్వతమ్మగారికి నాల్రోజులబట్టీ జ్వరమని. లేవటం లేదని' పొద్దున్న పనిపిల్ల చెప్పిన సంగతి గుర్తొచ్చింది నిలయకి. ఆవిడ తనతో మాట్లాడటం మానేసి అప్పుడే చాలా రోజులైంది. అయితేనేం ఇదివరకు తనతో ఎంతో చనువుగా ఉన్న మనిషే కదా! ఒంట్లో బాగులేనప్పుడు చూసొస్తే తప్పేముంది. వాళ్ళింటికి నడిచింది. గుమ్మంలోనే ఎదురైన రమ కాళ్ళకి చుట్టుకుపోయింది 'అత్తా' అంటూ. ఆ పిల్ల చెయ్యి పుచ్చుకుని 'అమ్మేదమ్మా!' అంది.

'రా! నిలయా!' నిలయ గొంతు విని లోపలికి రమ్మని పిల్చారు పార్వతమ్మగారు. ఆ గదిలోకి నడిచింది నిలయ.

ఆవిడ మంచం పక్కన ఉన్న స్టూల్ మీద కూర్చుంటూ అంది 'ఎప్పటి నించీ మీకు జ్వరం? పొద్దున్న పనిపిల్ల అంది నాతో.'

'నాల్రోజుల్నించీ జ్వరం. ఏమిటో నాల్రోజులు తిరిగితే నాల్రోజులు పడక. నా రోగం ఏమిటో నాకే అంతుబట్టటం లేదు.'

'డాక్టరేమన్నారు?'

'ఏ డాక్టరైనా ఏమంటాడు? మీలాంటి రోగులు మాక్కావాలంటాడు.' హాస్యంగా అంటూ చిన్నగా నవ్విందావిడ.

'ఏలాగైనా మీరు చాలా నీరసంగా కనపడుతున్నారు' పార్వతమ్మగారి కళ్ళల్లో నీళ్ళు చిందాయి. తెల్లబోయింది నిలయ.

'మీరేదో బాధపడుతున్నట్టున్నారు. అసలే ఒంట్లో బాగులేదు, మీరేవో ఆలోచించి మనసు పాడుచేసుకోకండి.' అంతకంటే ఏం చెప్పాలో తెలియక ఊరకుంది. అసలావిడ మనసులో బాధేమిటో అడగడానికి ధైర్యం చాలక ఊరుకుంది.

ఆవిడే నెమ్మదిగా, గొంతు తగ్గించి చెప్పడం మొదలుపెట్టింది 'అయిదారు రోజులైందేమో ఇది జరిగి ... ఆరోజు పొద్దున్న వరండాలో కూర్చుని ఆయన ఎవరితోనో కబుర్లు చెప్తున్నారు. ఆ వచ్చిన పెద్దమనిషెవరో 'ఆ ఎదురింట్లో ఒంటరి పిట్ట ఉంటోందిటకదూ! పిట్ట బావుంటుందా? నేనెప్పుడూ చూడటం పడలేదు.' అన్నాడు. ఈయనేమో అక్కడే ఆడుకుంటున్న రమని 'ఏమే! అమ్మేం చేస్తోంది' అని అడిగారు. అదేమో 'నీళ్ళు పోసుకుంటోందని' చెప్పింది. నేను నీళ్ళు పోసుకొచ్చి అప్పుడే గదిలో బట్టలు కట్టుకుంటున్నాను. నా స్నానం అయిపోయిన సంగతి దానికి తెలియక అలా చెప్పిందది.' ఒక్క క్షణం చెప్పడం ఆపిందావిడ. నిలయ గుండెల్లో రైళ్ళు పరిగెడుతున్నట్టనిపించింది. ఏం వినబోతున్నానో అన్న ఆతృత కళ్ళల్లో తొంగి చూసింది.

'అమ్మ నీళ్ళుపోసుకుంటోందా!' అని 'పిట్ట బావుంటుంది. నేనోసారి ట్రై చేశాను. కానీ లొంగే ఘటంలా లేదు. ఏం చూసుకునో ఆ గర్వం, ఆ ధైర్యం' అన్నారాయన నెమ్మదిగా' ఒక్క క్షణం ప్రకృతి స్తంభించినట్లయింది నిలయకి. విశ్వనాథంగారన్న మాటలకి ఆశ్చర్యమనిపించలేదు కానీ పార్వతమ్మగారామాటల్ని తు.చ. తప్పకుండా ధైర్యంగా తనతో చెప్తున్నందుకు ఆశ్చర్యమనిపించింది.

'నువ్వు నా చెల్లెలిలాంటి దానివి. నీ దగ్గిర నాకేమీ దాచాలనిపించదు. ఎందుకో నిన్ను చూస్తే నాకేదో తెలియని ఆప్యాయత కలుగుతుంది. ఇదేమిటి? ఈవిడిలా, పరాయి ఆడదాని ముందు తన భర్తని లోకువచేసి మాట్లాడుతోందని ఆశ్చర్యపడుతున్నావు కదూ!'

దానికేం జవాబు చెప్పాలో తెలియక మౌనం వహించింది నిలయ.

'ఆయన సంగతులన్నీ నాకు బాగా తెల్సు. పరాయి ఆడది కనిపిస్తే చాలు, ఆడదాని మొహం ఎప్పుడూ చూసి ఎరగనట్టు చూస్తారు. చూడటమే కాదు; ఆలోచనలు, ప్రయత్నాలు ఒకదాన్ని మించి ఒకటి పోటీపడి ముందుకి వస్తాయి. కానీ ఒకటి మాత్రం నిజం నాకు తెలుసనమ్మా... నేను నిన్ను నా స్వంత చెల్లెలిలా భావించుకుని అంత చనువుగా నీతో ఉన్నాను. ఒంటరిదానివి. నా అన్నవాళ్ళు లేనిదానివి. అన్న భావంతో నీకు చేరువకావడానికి ప్రయత్నించాను. అందుకే నీ విషయంలో కూడా ఈయన అసభ్యంగా ప్రవర్తిస్తారనే ఊహే నాకు రాలేదు. నా మాటనమ్మూ. ఆ నాటి తరవాత నేను క్షమాపణ చెప్పుకుంటున్నాను.' నిలయ రెండు చేతులూ పట్టుకుందావిడ.

నిలయ మనసు ద్రవించింది. ఆవిడ మీద గౌరవం, ఇష్టం మరింత పెరిగాయి, నెమ్మదిగా ఆవిడని వారించింది.

'మీ బాధ నేనర్థం చేసుకోగలను. అసలే మీ ఒంట్లో బాగులేదు. దీన్ని గురించే ఆలోచించి మరింత బాధ పడకండి.'

'ఆయనవల్లే, ఆయన ఆజ్ఞ ప్రకారమే నేనీ మధ్య నీకు దూరమయ్యానని నీకీపాటికి అర్థమయ్యే ఉంటుంది'

చిన్నగా తల ఊపింది నిలయ.

'నిలయా! ఎప్పటి నించో నిన్నొకటి అడగాలని ఉంది. అడిగితే ఏమనుకోవు కదా!'

'అడగండి.'

'ఆ మధ్య మీ ఇంటికి చంద్రశేఖరంగారబ్బాయి వస్తుండే వాడు కదా!'

'ఊ...'

'ఆ అబ్బాయి తప్పకుండా నిన్ను పెళ్ళి చేసుకుంటాడనుకున్నాను. ఇప్పుడబ్బాయి పై చదువులకి వెళ్ళాట్టగా.'

'ఔను.'

'ఎందుకు నిలయా! ఎందుకిలా చేశావు నువ్వు ఆ ముసలాయన మీ ఆఫీసులో పనిచేసే ఆయనని ఎవరో చెప్పుకుంటుంటే విన్నాను మూడు పువ్వులూ ఆరు కాయలుగా నడుపుకోవల్సిన జీవితాన్ని చేజేతులా ఎందుకు పాడుచేసుకుంటున్నావు? లోలోపల, నీకోసం నేనెంత బాధ పడుతున్నానో నీకెలా చెప్పగలను? ఆ చంద్రశేఖరంగారబ్బాయి నిన్ను చేసు

కోకపోతే నిన్ను పెళ్ళాడే యువకుడే ఉండ డంటావా? నీకేం తక్కువని ఆ ముసలాయన...'

నవ్వింది నిలయ 'ఆ ముసలాయన్ని నేను పెళ్ళాడతా ననుకుంటున్నారా ఏమిటి కొంప తీసి!'

'మరి!' తెల్లబోయినట్టు చూస్తుండి పోయిందావిడ.

'దానికంతా ఓ కథ ఉంది. వినే ఓపిక మీకుంటే చెప్తాను.'

'చెప్పు.'

వివరంగా మొదటినుంచీ రామనాథంగారి కుటుంబం గురించీ, జయతో తన పరిచయం, జయపడే వేదన, రామనాథంగారి ప్రవర్తన అన్నీ చెప్పి 'రామనాథంగార్ని మంచి మనిషిగా చెయ్యాలనే కోరిక; వివరికి ఉపయోగపడని నా ఒంటరి బ్రతుకు మరొకరికి సుఖ సంతోషాలు కలిగేటందుకు కాస్త ఉపయోగించి చూద్దామనే ఉద్దేశం నాలో కలిగాయి. నా ప్రయత్నం సఫలమైంది. ఇంతకన్నా, నా మనసంతా నిండిన సంతోషాన్ని మీకెలా విడమరిచి చెప్పగలను?' అంది నిలయ.

ఆశ్చర్యంతో నోట మాట రాలేదు పార్వతమ్మగారికి.

చివరి కెలాగైతేనేం నోరు పెగుల్చుకుని 'వింత పని చేశావు నిలయా! వివరో పరాయి వాళ్ళకోసం, వాళ్ళ సుఖంకోసం నీ నూరేళ్ళ జీవితంలోనూ నిప్పులు పోసుకున్నావా? నీలాంటి వాళ్ళని ఎక్కడా చూడలేదు నిలయా! వెక్కడా చూడలేదు. వెందుకిలా చేశావసలు. నీ బ్రతుకేమై పోతుందో ఆలోచించావా? దీనివల్ల నీ కెన్ని కష్టాలు సంభవిస్తాయో ఆలోచించలేక పోయావంటే నేను నమ్మను.'

'నా బ్రతుకేమైపోతుందని మీ భయం!' నవ్వటానికి ప్రయత్నించింది నిలయ.

'నవ్వుతున్నావా! నాకు తెల్సు గుండెల్లో అగ్నిపర్వతాలు దాచుకుని పెదవుల మీద చిరునవ్వు నిలుపుకోవాలని చూస్తున్నావా? మన్వాడినదంతా నాటకమని, రామనాథంగార్ని మంచి మనిషిగా చెయ్యాలనే పదుద్దేశ్యం తప్ప నీ మనసులో ఏ కల్మషమూ లేదని నమ్మాను కాని ఈ సంఘాన్నెలా నమ్మించగలవు నిలయా! విలా నమ్మించగలవు? నువ్వు తొందరపడ్డావనే నా బాధ. నువ్వు పెళ్ళి చేసుకుందామనుకుంటే ఇది అడ్డు కాదంటావా?'

'నేను...నే నసలు పెళ్ళి చేసుకోవాలనుకుంటేగా! ఆ ఆలోచన నా మనసులోకి రానివ్వకూడ దనుకుంటున్నాను.'

గబుక్కున నిలయ చేతిని తన చేతిలోకి తీసుకుని అందావిడ. 'అలా అనకు. నిన్ను చూస్తుంటే జాలీ, నీ అతి మంచితనానికి కోపమూ కూడా వస్తున్నాయి నాకు. జీవితమంతా ఒంటరిగానే గడపగలనన్న ధైర్యం నీకుందా! వద్దు నిలయా వద్దు. పెళ్ళసలు చేసుకోకూడదన్న నిర్ణయానికి రావద్దు.'

'పోనీ ఒకటి చెప్పండి. ఇలా అడుగుతున్నానని మీరే మనుకోవద్దు. పెళ్ళి చేసుకుని మీరేం సుఖపడుతున్నారు! సుఖమూ, మనశ్శాంతి ఉంటదా మీకు? మానసికంగా నరకయాతన అనుభవిస్తుంటే ఇంక ఆ జీవితంలో సుఖమన్న మాటకి తావెక్కడుంటుంది? మీ రిటువంటి బాధ అనుభవిస్తూ కూడా 'పెళ్ళి చేసుకు తీరాలని', అని నా కెందుకు చెప్తున్నారు?'

'మంచి ప్రశ్నే వేశావు. కానీ పెళ్ళి చేసుకన్న అందరికీ నాకు పట్టిన దౌర్భాగ్యమే పడుతుందని విందుకనకోడం?'

'అది నిజమే. అందరికీ పట్టదు. కానీ వివరి రాత విలా ఉందో వివరమూ చెప్పలేం. వింతమందో పెళ్ళయిన ఆడవాళ్ళు మానసికంగా వేదన పొందుతున్నా పైకి చెప్పుకోలేకపోవడమే కాక, ప్రతి కన్యకీకూడా పెళ్ళి చేసుకోమనే సలహా తప్ప వద్దని అనరెందుకని? నాకెప్పటినించో ఉన్న అనుమానం ఇది. సందర్భం వచ్చింది కాబట్టి మీరేమంటారోనని అడుగుతున్నాను.'

'నీ సందేహ నివృత్తికి సరియైన సమాధానం చెప్పగల మాటలు నా దగ్గర లేవు. చెప్పగల తెలివీ, శక్తీ కూడా లేవు. కానీ ఒకటి మాత్రం చెప్పగలను. పెళ్ళన్నది స్త్రీకి ప్రసాదించేది మొట్టమొదటి రక్షణ. ఆ తర్వాతే సుఖ సంతోషాలు. భర్త చెడు ప్రవర్తన సంగతంటావా? అదీ కట్టుకున్నది కర్మ సిద్ధాంతానికి ముడివేసి వేదాంతం ఒంటపట్టించుకుని బ్రతుకీడుస్తుంది. సన్మార్గానికి మళ్ళించాలని వింతో ప్రయత్నిస్తుంది. అయినా ప్రయత్నం ఫలించక భర్త దారికి రాకపోతే ఏం చేస్తుంది వేదాంతం ఒంటబట్టించుకోక! ఇప్పుడు ... ఆ రామనాథంగారి సంగతే తీసుకో నీ ప్రయత్నంవల్ల ఒక్క నీ మీద పిచ్చి తప్ప ఇతర వ్యసనాలు, చెడు అలవాట్లు మానుకున్నారు కదా! నీ ప్రయత్నం సఫలమైనట్టే ... కానీ నిలయా...మరి ఆయనతో నిజం విప్పుడు చెప్తావు?'

'ఈసారి ఆయన్ని కల్సుకున్నప్పుడు చెప్పేస్తాను'

కాసేపిద్దరూ వివరి ఆలోచనల్లో వారు మౌనంగా ఉండిపోయారు.

* * *

'ఆమనో సుందర్ వస్తేశాడు వసన్నా అన్న ట్రైముకి' గేటు వైపు మాస్తూ అన్న సుజాత మాటలకి వింతగా మాసింది యూస్తి.



# విడిన మబ్బులు

'నీ మనసేం బాగున్నట్టు లేదు కాసేపు పార్కులో కూర్చుందాం పద'మని బలవంతాన తీసుకొచ్చింది తనని. కానీ...ఇదేమిటి? సుందర్ వస్తాడని ముందే తెల్సినప్పటికీ తనకి. తనతో మాట మాత్రంగానైనా అనలేదు. సుందర్ వస్తాడని చెప్తే తను రానంటుందేమో పార్కుకన్నీ చెప్పకుండా తీసుకొచ్చింది. అసలిప్పుడెందుకొస్తున్నట్టు సుందర్?

'మనం ఇక్కడ కూర్చున్నట్టు సుందర్కెలా తెలుస్తుంది. ఎవరికీ కనపడని మారుమూల కూర్చున్నామయ్యె! ఉండు నే వెళ్ళి ఇక్కడికి తీసుకొస్తాను.' అంటూనే జవాబు కోసం ఎదురు చూడకుండా గబగబా గేటువైపు నడిచింది సుజాత దూరంగా మరో పక్క పందిగలెట్టి ఆడుకుంటున్న పిల్లల్ని చూస్తూ ఉండిపోయింది ఝాన్సీ. సరిగ్గా కొంచెం సేపట్లోనే పక్కన అడుగుల చప్పుడై తిరిగి చూసింది. సుందర్ ఒక్కడే వచ్చాడు. ఝాన్సీకి కొద్ది దూరంలో చతికిలపడ్డాడు. ఇటూ అటూ చూసింది ఝాన్సీ సుజాత కోసం.

'సుజాత కోసమేనా చూస్తున్నారు. ఇక్కడికి దగ్గర్లోనే పక్క సందులో స్నేహితురాలెవరో ఉందిట కదూ! ఆ అమ్మాయితో ఏదో మాట్లాడాలని వెళ్ళింది. ఇప్పుడే వొచ్చేస్తుంది.'

" అంతా అర్థమైనట్టనిపించింది ఝాన్సీకి.

కావాలనే అలా వెళ్ళిపోయింది సుజాత. అందుకు సందేహం లేదు. లేకపోతే 'కాసేపు పార్కులో కూర్చుందాం రమ్మని' తనని బలవంతంగా తీసుకురావడం, సుందర్ వొస్తాడని మాట మాత్రంగానైనా తనతో అనకపోడం, ఇప్పుడేమో తామిద్దర్నీ వదిలిపెట్టి తను తప్పుకోడం...ఇదంతా ఏమిటి? సుందర్ మొహంలోకి చూడటానికే ఏదో తెలియని భయం ఆవహించింది.

'క్షమించండి. నేను మీతో మాట్లాడటం వల్ల మీకేమి ఇబ్బంది కాదుకదా!' సుందర్ ప్రశ్న.

'ఏం చెప్పాలి? నోట్లోంచి మాటే రాదెందుకని!' తలవంచుకుని గడ్డి పరకలు పీకుతూ మౌనంగా ఉండిపోయింది ఝాన్సీ

'మీరు చెప్పమన్నదంతా సుజాత నాతో చెప్పింది. నేనూ బాగా ఆలోచించుకున్నాను. ఏమీ దాచి పెట్టాలన్న తలంపులేక ముందే అన్నీ చెప్పెయ్యమనటంతో మరింత చేరువయ్యారు నా మనసుకి. మీ గురించిన ఆలోచనలే ఆ రోజునించీ నాకు. మాట్లాడరేం?' అప్రయత్నంగా ఝాన్సీ చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు సుందర్.

తన మనసు తన వశం తప్పుతున్నట్టనిపించింది ఝాన్సీకి. అతని చేతిలో ఉన్న తన చేతిని వెనక్కి తీసుకుందామన్న ఆలోచనే రాలేదు.

'జాన్ మోసం చేశాడని మొత్తం మగజాతిమీదే కోపం రాలేదు కదా!'

'మొదట్లో వచ్చింది. కానీ ఇప్పుడు లేదు. ఇప్పుడింకా ఆ కోపం ఉండి ఉంటే ఇలా ఇంతసేపు మీ ఎదురుగా కూర్చుని ఉండేదాన్ని కాదు.'

'అమ్మయ్య! ఇప్పటికైనా మాట్లాడారు.'

అతని కళ్ళల్లోకి ఒక్కక్షణం రెప్ప వాల్చకుండా చూసిన ఝాన్సీని ఏదో మత్తు ఆవహించినట్లయింది. ఏదో కలవరపాటు కమ్మినట్లయింది. ఎందుకు? ఎందుకిలా అవుతోంది. ఏవేవో నిర్ణయాలు చేసుకుంది తను అసలు పెళ్ళే చేసుకోకూడదనుకుంది. తన నిర్ణయాలన్నీ గాలిలో దూది పింజల్లా ఎగిరిపోతున్నాయి.

చటుక్కున మోకాళ్ళల్లో తల దాచుకుంది.

దగ్గరగా జరిగి ఝాన్సీ భుజం చుట్టూ చేయి వేశాడు సుందర్.

తలెత్తి చూసింది. ఆ కళ్ళల్లో నీరు చూసి చలించిపోయాడు 'ఛ! ఏడుపెందుకు ఝాన్సీ?' అప్రయత్నంగా 'ఝాన్సీ' అంటూ పేరుతో చనువుగా పిల్చి లాలించాడు.

'నా బాధ ఎవరికీ అర్థం కాదు. నా మనసు నేను చెప్పినట్టు వినట్లేదు. నాకూ, నా మనసుకి ప్రతిక్షణం పోరాటం సాగుతోంది అయితే అంత గాఢంగా, అతను లేకపోతే బ్రతకలేనన్నంతగా జాన్ని ప్రేమించావా అనడిగితే 'ఔనని' ఖచ్చితంగా చెప్పలేను మరైతే ఇంక బాధేమిటంటీ అనడిగితే దానికీ సరియైన సమాధానం నా దగ్గర లేదు. కానీ నాలో రేగే తుఫానుకి కారణం 'జాన్ని ప్రేమించాను, పెళ్ళాడతానని మోసపోయాను. ఒకర్ని ప్రేమించి మోసపోయినవాళ్ళు తిరిగి మరో పెళ్ళి చేసుకుని నిజాయితీగా బ్రతకటం చేతకాదేమో. ఒకసారి మోసపోయిన మనసున్నవాళ్ళు మళ్ళీ అంత నమ్మకంగా మోహించుకొన్నాళ్ళకి మరొకరినో పెళ్ళాడటం మనసున్న వాళ్ళు చేసేపని కాదేమో అన్న బాధ. ఇంత విచిత్రమైన బాధ ఇంతవరకూ ఏ ఆడదైనా అనుభవించి ఉంటుందా అసలు.'

'పిచ్చిదానా! ఇదంతా విన్ను నువ్వు వంచించుకోడమే. ఆత్మవంచన చేసుకోడమెందుకూ? నీ బ్రతుకు ఎండిన మోడు చేసుకోదల్చావా? సంఘం కోసం ఏదో త్యాగం చెయ్యాలన్న ఊహే నీకొద్దు ఇది పూర్తిగా నీ వ్యక్తిగత విషయం. పిచ్చి పిచ్చి ఆలోచనలు మానుకో. ఇద్దరం కల్సి...' అంటూ చిన్నగా నవ్వాడు సుందర్.

మరో నిమిషం పోయాక మళ్ళీ అతనే అన్నాడు. 'సుజాత నీ ప్రేమకథ చెప్పినప్పుడు ఆరోజు రాత్రంతా నిద్రలేదు నాకు. కానీ మనసెప్పుడో నీకంకితమైపోయింది. అది వెనక్కి తీసుకునే శక్తిగానీ, లోచనగానీ లేవు.' ఒక్కక్షణం ఆగాడు సుందర్.

ఏదో చెప్పబోయింది ఝాన్సీ:

'ఇంక నువ్వేమీ అడ్డు చెప్పకు' చటుక్కున లేచి ఝాన్సీకి తనచేయి అందించాడు. మంత్రముగ్ధలా అతన్ననుసరించింది ఝాన్సీ గేటు దగ్గిరే ఎదురుపడింది సుజాత.

'దొంగా' అంటూ చిన్నగా నవ్వింది ఝాన్సీ.

'తోడుదొంగలు మీరిద్దరూ ఒకటయ్యారు. మధ్యన నన్ను దొంగ అంటావెందుకూ?'

'నాకు తెల్సులే సుందర్! పదండి దూ!'

సుందర్, ఝాన్సీ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. ఇద్దరికీ నవ్వాగింది కాదు.

'ఏయ్ ఝాన్సీ! ఇంక ఇవాళ్టినించీ, నీ మనసులో రోజూ పెరుగుతున్న యుద్ధానికి ఫుల్‌స్టాప్ పడుతుంది కాబట్టి దానికి పాటుపడిన ఈ స్నేహితురాలికి పెద్ద బహుమతి ఇవ్వకపోతే ఊరుకునేది లేదు' నవ్వుకుంటూ ముగ్గురూ ఇంటిముఖం పట్టారు, ఝాన్సీ మనసులో అలజడి తగ్గినట్టయింది.

(ఇంకా వుంది)

## నిధులకోసం వేట-4

## విక్ ఆల్‌డిస్

# సముద్ర గర్భంలో ధనరాసులు

అది పదహారవ శతాబ్దంనాటి మాట. స్పెయిన్ పన్నెండేళ్ల చరిత్రలో 45 శాతం ఓడలు సముద్రంలో ముక్కలయిపోయాయి. ఈ ఓడల్లో మోసుకువెళ్తున్న బంగారం, ధనం యావత్తూ సముద్ర గర్భంలో కలిసిపోయాయి. ఈ నిధి విలువ కోట్లకొద్దీ వుంటుందని చరిత్రకారుల అంచనా. దేశదేశాల వారి కళ్లూ ఈ నిధుల మీదే!

ఈ బంగారమంతా ఒక్కచోట లేదు, సముద్రం అడుగున మైళ్లకొద్దీ విస్తీర్ణంలో వెదజల్లబడినట్టుంది. అందుచేత ఎంత వెతికినా కొద్ది ఫలితం మాత్రమే కనిపిస్తుంది. బాగా లోతునకాకుండా బద్దున పగిలిన ఓడలకి సంబంధించిన బంగారం మాత్రం దొరుకుతుంది.

పగిలిన ఓడలకి—ఆ ఓడల్లో సంపదకి సంబంధించిన వివరాలు చరిత్రలో స్పష్టంగా వున్నాయి.

ఈ సముద్రభాగం అడుగున మట్టి, బురద వుండటంవల్ల అందులో ఈ బంగారమంతా కూరుకుపోయింది అందుచేత వెతికేవాళ్ళకి కష్టం.

ఓడలకి సంబంధించిన ఒక కథ ఇలా వుంది: ఆ ఓడపేరు ఫ్లోరెన్షియా. 1588 లో ఇంగ్లండుకి బయలుదేరింది. అది యుద్ధకాలంనాటి సంగతి. ఓడనిండా దోచుకున్న డబ్బూ బంగారం వుంది.

సముద్ర మధ్యంలో పెద్ద గాలివాన వచ్చింది. ఓడ ఇంగ్లిష్ చానల్‌నుంచి నార్త్ సీలోకి మళ్ళింది. స్కాట్లండుమీదుగా స్పెయిన్‌కి తిరిగిపోవటంకంటె గత్యంతరం కనిపించలేదు.

అంతకంతకి గాలివాన ఉధృతంగా విజృంభించింది.

స్కాట్లండు, ఐర్లండు తీరాన రాళ్లకి తగుల్కొని చాలా ఓడలు తునాతునకలయిపోయాయి.

కాని, ఫ్లోరెన్షియా విలాగో బయటపడింది. కమాండర్ డాన్ పెరెయిరా కష్టసాధ్యంమీద 'టాబెర్మరీ బే'లోకి మళ్ళించాడు. కాని, వారికి త్రాగడానికి నీళ్ళు, తిండానికి తిండీ కరువైపోయింది.

ఇంతలో శత్రువులు విరుచుకుపడ్డారు: మెక్లీన్ అనే అతను ఈ ఓడను పేల్చి పారేశాడు. ఇందులోవున్న బంగారమంతా నీటిపాలయిపోయింది.—ఇది ఒక కథ.

స్పానిష్ రికార్డులను తనిఖీ చేసిన ఒక శాస్త్రకారుడు ఫ్లోరెన్షియాని 'ధనాగారంగా' వర్ణించాడు. 30 మిలియన్‌ల డబ్బుతో వున్నట్టు అంచనా వేశాడు.

ఈ ఓడకి సంబంధించిన హక్కులు రాయల్ చార్టర్ దగ్గర వున్నాయి. నిధి లభించినట్టయితే ఫిలిప్స్ రాజుకి కిరీటం, మరో శాతం నిధిని అతనికి సమర్పించాలని ఒక నిర్ణయం వుంది.

చార్లెస్ 11, జేమ్స్ 11 ఈ విషయం మీద కోర్టులకి వెళ్లారు. నిధి మాకు చెందాలంటే మాకు చెందాలని వీరివాదం.

ఈ నిధుల్ని సేకరించడానికి లేదా వెతకడానికి చాలమంది అప్పటినుంచి ప్రయత్నిస్తున్నారు.

1683 ఆర్చిబాల్డ్ మిల్లర్ అనే గజయీతగాడు రంగంలోకి దూకాడు. ఒక వెండి గంట, కొన్ని లంగర్లు, మరికొన్ని ఫిరంగులు బయటికి తెచ్చాడు. 'నాకు కిరీటంకూడా చిక్కింది. పైకి తీసుకు వద్దామని తాటికి ముడివేశాను. మార్గమధ్యంలో అది జారిపోయి పెద్ద పెద్ద రాళ్ళ మధ్యకి వెళ్లిపోయింది' — అన్నాడు అతను. చాలమందికి ఈ ఉదంతం ఉత్సాహాన్ని రేకొల్పింది,

అక్కడనుంచి చాలా ప్రయత్నాలు జరిగాయి. పెద్ద లాభం ఏదీ కలగలేదు, 1740 లో ఒక పెద్ద ఫిరంగి దొరికింది. ఈ ఫిరంగివల్ల చరిత్ర చెప్పిన ఆధారాలు నిజమని రుజువయ్యాయి. కొన్ని బంగారు గొలుసులు, చేతిగాజులుకూడా ఈ ప్రయత్నంలో లభించాయి.

సాంకేతికంగా కష్టనష్టాలున్నందువల్ల

(56వ పేజీ చూడండి)



నటుడు, రచయిత శ్రీ పులికంటి కృష్ణారెడ్డికి తిరుపతిలో సన్మానం జరిగిన సందర్భంలో సభాధ్యక్షులు డాక్టర్ సి. నారాయణరెడ్డి 2516/—రూ. రొక్కంతోను, దుశ్శాలువతోను శ్రీ కృష్ణారెడ్డిని సన్మానిస్తున్న దృశ్యం.

# కారుమేఘం

## గరికపాటి కృష్ణమూర్తి



ఢిల్లీ—మద్రాసు జి. టి. మంచి స్పీడులో పోతోంది. ఫస్టుక్లాస్ కూపేలో కూర్చున్న రావు ఆలోచనలు కూడ అంత వేగం పుంజుకొని పరుగెత్తుతున్నాయ్. కిటికీ ప్రక్కన కూర్చొని బయటకు చూస్తున్నాడు. ముఖంలో దిగులు, విచారం, ఆవేదన. స్పీడులో దూరాన ఉన్న చెట్లు సీమలు దగ్గరవుతున్నయ్. దగ్గరవి దూరంగా పోతున్నవి. సుమిత్ర పత్రిక చదువుకొంటు న్నది. పిల్లలిద్దరూ మరోవైపున బయట ప్రపంచం చూస్తూ ఆనందిస్తున్నారు. భార్య వంక చూశాడు. ఇతరుల బాధా విచారాలు తనవి కానట్లు పత్రికా పఠనంలో లీనమై ఉన్నది. పిల్లలు సరేసరి, మంచి సీవరీ వచ్చినప్పుడు కేరింతలు కొడుతున్నారు సముద్రపు నురుగులాంటి వాళ్ళు.

నాన్న ఎలాగున్నాడో?...బెల్లగాం అందు కొనే పన్నెండు గంటలయింది. ఈపాటికి ..ఛ!... ముఖ్యంగా అమ్మ ఎంత బాధ పడుతుందో! ముచ్చటగా ముగ్గురు కొడు కుల్ని కన్నా ఒక్కడూ యింటిపట్టున లేడు. తను ఢిల్లీలోనే ఉంటున్నాడు. రెండోవాడు ఎయిర్‌ఫోర్సులో పైలట్‌గా మద్రాసులో ఉన్నాడు. మూడోవాడు మధు మాత్రం వైజాగ్‌లో డాక్టరుగా ఉన్నాడు. కాస్త దగ్గర ఉన్నవాళ్ళల్లో వాడే. వాడైనా సమయానికి చేరుకున్నాడో లేదో!... అమ్మ ఒక్కతే యీ కష్టకాలంలో యెంత యిదై పోతుందో!! ఏనాడూ ఒకళ్ళని ఒక మాటని ఎరుగదు. అనిపించుకొన్నదీ కాదు. కష్టా ల్లోనూ, సుఖాల్లోనూ ఎప్పుడూ చిరునవ్వు చిందిస్తూ అమృతం వర్షించేది. ముఖం నిండా పెద్ద కుంకుమబొట్టు పెట్టుకొని మనసారా దీవిస్తూ తాము యే పనులకి బయలుదేరినా విడుల్చొచ్చేది. అమ్మకిక ఆ చిరునవ్వు ఉండదు కాబోలు! ఆ బొట్టు ఉండదు కామోలి.

'డాడీ! డాడీ!! ఆ జంతువు లేంటి డాడీ.' గొర్రెల్ని చూపించి అడుగుతున్న పాప మాటలతో యీ లోకంలోకి వచ్చాడు రావు.

'గొర్రెలమ్మా!' ముభావంగా సమాధాన మిచ్చాడు. సమాధానంలో ఉన్న 'డ్రైనెస్' అర్థమయిన దానిలా మళ్ళీ వెళ్ళిపోయింది పాప.

పిల్లలు తన విచారాన్ని అర్థం చేసుకో లేదనిన్నీ, భార్య తన ఆవేదనలో పాలు పంచుకోవటం లేదని బాధ పడుతున్నాడు. కాని తాను మాత్రం యేం చేస్తున్నాడు? అవసాన దశలో ఉన్న నాన్నను గూర్చి ఆలో చించటం లేదు. నాన్నకు సేవలు చేస్తూ అమ్మపడే కష్టాల్నీ, ఆయన్ని గూర్చి ఆమె పొందే దుఃఖాన్ని గూర్చి తను బాధపడు తున్నాడు. తన ప్రవర్తన తనకే విడ్డూ రంగా ఉన్నది.

అయితే నాన్న...నాన్నను గురించి పాత కథలన్నీ త్రవ్వటం అంటే...అవన్నీ యీ సమ యంలో చేయవలసిన పనికాదు ... అయినా ముసురుకొంటున్నాయ్.

ఆయనకీ— తనకూ ... తనకే ఏమిటి? మిగతా తమ్ముళ్ళిద్దరికీ కూడా యే నాడూ రాజీకుదరలేదు. అమ్మ ఒక సేతుబంధ నంలా ఉండి యీ బాంధవ్యాలు, మమ తానురాగాల్ని ముడేసి లాక్కొస్తుందికాని లేకపోతే యేనాడో తెగిపోయేవి. తండ్రంటే కృతజ్ఞతా భావం లేని సంస్కారహీనులు కాదు. ఏనాడూ ఆయనలో ఆ ప్యాయత ఆదరణ అను రుచి చూడలేదు. పైగా తమ దారిని తమని పోనివ్వ లేదు సరికదా చిన్నప్పటినుండి ప్రతివిషయంలోనూ ఒక యిష్టాన్ని లేవదీసేవాడు. బయట ప్రపం చానికి తాము ముగ్గురూ, బుద్ధిమంతులూ —యోగ్యులూ అయినా ఆయన దృష్టిలో మాత్రం చవట దద్దమ్మలే.

'ఛాయ్! ఛాయ్ సాబ్.'

ఏదో స్టేషను వచ్చింది. పిల్లలకి క్రీమతికి తినుబండారాలు కొని తలొక ఛాయ్ ఆర్డరిచ్చాడు. తనొక టీ తీసుకొన్నాడు.

'డాడీ! డాడీ! అవి కొని పెట్టవూ?' బాబు అడిగాడు.

అమ్మేవాడిని పిలిచి కొని పెట్టాడు.

'నాన్నా! నాన్నా! ఆ బండి కొని పెట్టవూ?' చిన్నప్పుడు ప్రక్క వూరి తిరణాలలో అడిగాడు తను.

'ఛత్! వెధవ. అదెందుకురా ఇంటికెళ్ళే టప్పటికి యిరిగిపోతుంది.'

అయినా తను మారాం చేశాడు. ముద్దు మురిపెం తీర్చలేదు సరికదా తిరణాలని లెక్క చేయకుండానే వీపమోది వోరు ముయ్యించాడు.

హైస్కూల్లో చదువుకున్నప్పుడు కూడా ఏక్కర్లేదు కాని అమ్మ పుణ్యమా అని ఆఖరికి ఏలాగో స్కూలు ఫైనల్లో రెండు ప్యాంట్లు కుట్టించుకో గలిగాడు.

తర్వాత కాలేజీకి వెళ్ళేటప్పుడు ఖర్చుల విషయమై మరో చిన్నపాటి యుద్ధం. విన్ని యుద్ధాలు జరిగినా కొడుకులకి కావాల్సినవి సాధించుకొంటూనే ఉండేది అమ్మ. తను కోసం ఆమె పడేది తిట్లన్నీ.

కాలేజీకి పట్నం వచ్చి కొంచెం స్వేచ్ఛా వాయువు పీల్చుకో గల్గినా అడుగుకొక పి. ఐ డి. పెట్టాడు. ఈ విషయం చాలా కాలానికి గాని తెలియలేదు. అట్లని తను యేనాడూ దొరికిన స్వేచ్ఛని దుర్వినియోగం చేసుకోలేదు. పైపెచ్చు నాన్న తనని చూచి మెచ్చుకోవాలని, యేనాటికైనా తన్ను పొగడాలని పట్టుదలతో కష్టపడి చదివాడు. కష్టానికి తగ్గ ఫలితాన్నే పొందాడు. బి. ఏలో ఫస్టు క్లాసు వచ్చింది. అమ్మ సంబరపడి పోయింది. వెయ్యేనుగుల యెత్తంత పనైయింది.

'చూశారా! పెద్దాడు.' విజయగర్వంతో చుట్టుప్రక్కలవాళ్ళు తనను ఏలా మెచ్చుకొంటున్నది పూసగుచ్చినట్లు చెప్పింది.

అప్పుడు కాబోలు నాన్న ముఖం మీద ఓ చిరునవ్వు మొలిచింది. అదీ ఆ బుర్ర మీసాలనుండి బయటకు రానేలేదు.

ఆ తర్వాత యం. ఏ. కోసమని వాల్తేరు యూనివర్సిటీకి వెళ్ళాడు. రెండేళ్ళకు అదీ అయిపోయింది. మరో యేడు ఆ ప్రాంతాల్లోనే లెక్చరర్ గానూ ఐ.ఏ.యస్. చేశాడు. అదృష్టవశాత్తూ అదీ ప్యాసయ్యాడు. ప్యాసయినపుడు 'నా కొడుకు ఐ. ఏ యస్. ప్యాసయ్యాడని చెప్పుకొన్నాడో లేక 'నా కొడుకుని కలెక్టర్‌ను చేశా'నని చెప్పుకొన్నాడో తనకు తెలియదు. కాని ఆ పరీక్ష ప్యాసవ్వటమే తమిద్దరిమధ్యా అతుకులు బొతుకులుగా ఉన్న సంబంధాలకు స్వస్తి పలకటం జరిగింది. ఐ. ఏ. యస్. ప్యాసయినందుకు 'సంతోషం' అని యేమి ఉత్తరం రాశాడో తర్వాత ప్రతి ఉత్తరం లోనూ దీవెనలే. ఐ. ఏ. యస్. ప్యాసయ్యాడు—వాడూ ఒక ఆఫీసర్ కాబోతున్నాడని లేకపోయినా మీసాలొచ్చిన కొడుకుని మిత్రుడిలాగ చూసుకోవాలన్న యింగిత జ్ఞానమున్నా లేకుండా అవాకులూ చెవాకులతో వచ్చేవి ఉత్తరాలు.

అక్క కూతురు హేమ పుట్టినప్పటి నుండి తన 'పెళ్ళా'మనే అటూ యిటూ వారి అభిప్రాయాలు కాని తాను యేనాడూ తన అభిప్రాయాన్ని చెప్పలేదు. ఆ అవసరం కల్గలేదు. నీ అభిప్రాయ మేమిటని అడగనూలేదు. అది తన తప్పు కాదు వాళ్ళదో అడగకొనేదానికి తను బాధ్యుడు కాదు. వాళ్ళ కోర్కెను విధిగా నెరవేర్చాలన్న ధర్మం తనమీద లేదు. అయినవాళ్ళు, రక్తసంబంధీకులైనవాళ్ళ అభిప్రాయానికి గౌరవం యివ్వాల్సినమాట వాస్తవమే. వారికి తన మీద అధికారం ఉండే మాట నిజమే. కాని తన అభిరుచుల్ని వ్యక్తిత్వాన్ని పణంగా పెట్టి మాత్రం కాదు.

ఇక్కడే నాన్నకు గట్టిగా ఎదురు తిరిగింది. దింట్లోనే అమ్మ కూడా నాన్న పార్టీ అయింది కూడా. ఈ పెళ్ళి గొడవలోనే యిద్దరూ యెప్పుడూ కలుసుకోలేని ఉత్తర దక్షిణ ధృవాలైపోయారు.

సుమిత తానూ పనిచేసే కాలేజీలో లెక్చరర్‌గా పనిచేసుకపోతే యెలాగుండేదో?

కాని నాన్నకు యెప్పటికైనా యేదో విషయంలో కన్‌ఫ్రంట్ అవ్వాల్సి వస్తుందని తనకు తెల్సు. దానికి యీ సుమిత్ర కారణమైంది.

ఆఖరికి పెళ్ళి కూడా మిత్రుల సహాయంతో చేసుకొన్నాడు. వచ్చి దీవించడానికి కూడ నాన్నకు ఆత్మగౌరవం అడ్డొచ్చింది, అమ్మకి నాన్న అడ్డొచ్చి ఉంటాడు. తమ్ముళ్ళు స్వాతంత్ర్యం లేనివాళ్ళు. ఇక అక్క బావ శత్రువులే అయ్యారు.

పెళ్ళయిన కొంతకాలంవరకూ అమ్మ కూడా ఉత్తరాలు రాయకపోయినా తర్వాత ఉండలేకపోయింది. ఇంటి దగ్గర విషయాలు అన్నీ వ్రాస్తూ ఉండేది. తమ్ముళ్ళూ రాస్తూ ఉండేవాళ్ళు, తను కూడ తన బాగోగుల గురించి విప్పటికప్పుడు వాళ్ళకి తెలియచేస్తూనే ఉన్నాడు.

అమ్మా నాన్నలు మాత్రం రాకపోకలు బంద్ చేశారు. తమ్ముళ్ళు మాత్రం అప్పుడప్పుడూ వచ్చిపోయేవాళ్ళు.

తనకు ఆశ్చర్యం కలిగించేదేమిటంటే బాబు పుట్టినప్పుడు అమ్మ వచ్చి చూచిపోవటము. అపుడు హైదరాబాద్‌లో ఉన్నాడు తాను.

'నాన్న కూడా రాలేకపోయారా అమ్మా?'

'నీవచ్చావుగనుకనా ?'

పెద్దవాళ్ళ పట్టుదలలు మాత్రం అంత గాలి కెగిరిపోయేవా అన్న విసురు.

తన పెళ్ళయినప్పటినుండి యెప్పుడూ గుంటి గడప తొక్కి యెరగడు అసలు నాన్నకు పెద్ద కోడలు యెలాగుంటదో కూడ తెలియదు. ఈ విషయంలో అనేక సార్లు తనలో తాను తర్కించుకొన్నా వెళ్ళకపోవటమే శ్రేయస్కరమనే నిశ్చయానికొచ్చాడు. జరిగున్న భాగోతమని తను సర్దుకుపోగల్గినా ముక్కూ మొహం యెరగని సుమిత్ర కూడా బాధపడాల్సి వస్తుందని ఆ ప్రయత్నమే విరమించాడు.

కాని యీనాటికైనా నాన్నే గెలిచాడు.

అయితే తను తలొగ్గి వెళ్తున్నాడా ? లేక లోకభీతి చేత పోతున్నాడా ?...ఏమో ! ఏదైనా కావొచ్చు అంతరాంతరాల్లో ఎక్కడో మిణుకు మిణుకు మంటున్న నాన్న మీది అనురాగం కావొచ్చు. అమ్మ మీదున్న ప్రేమానురాగాలవలన కావొచ్చు ఎంత గొప్పవాడైనా, దేన్నీ ఖాతరు చేయనివాడని అనుకొంటున్నా లోలోపల లోకం యేమనుకొంటుందో అన్న భయమూ కావొచ్చు. ఏదైనా యీ ప్రయాణానికి నాన్న కారణం కాబట్టి ఆయనే గెలిచాడు.

రాత్రి ఏనిమిదయింది. ఏదో స్టేషను వచ్చింది. మిల్సుకి అందరూ దిగుతున్నారు. సుమిత్రకి పిల్లలకి భోజనానికి ఆర్డర్

'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి;' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుచున్నాము.— సం॥



## కారుమేఘం

రిచ్చాడు. తనకు భోజనం చేయ బుద్ధి పుట్టటంలేదు. ఏదో నాల్గు పళ్ళు తీసుకొన్నాడు,

కొంచెంసేపటికి రైలు మళ్ళీ బయలుదేరింది. ఏదైనా చదువుదామని పుస్తకం తెరిచాడు కాని మనసు లగ్నం కావటంలేదు. అదెప్పుడో వెళ్ళిపోయింది.

పది సంవత్సరాలు వెనక్కి వెళ్ళింది.

ఆ ముందుకు పోయింది.

ఇంకా దానికంటే ముందుకుపోయి ఒకప్పుడు తనూ అంతర్భాగంగా ఉన్న తన యింటి చుట్టూ. ఆ యింటిలో ఉండే మనుష్యులు, వారి పరిస్థితుల చుట్టూ తిరుగుతూ ఉన్నది.

ఒక గార్డినాల్ వేసుకొన్నాడు. అయినా ఆ ఆలోచనల వైబ్రేషన్స్ పోలేదు. వాటం బెటి తను—తనెంబటి అవి, ఆ వేటలోనే యెప్పుడో నిద్రపట్టింది.

* * *

తమ్ముళ్ళురాము,మధు ఎదురుగా కూర్చున్నారు చెరొక కుర్చీమీద. అమ్మ అపర శోకమూర్తిలా ఉన్నది. చుట్టూ ఒలగం ఉన్నా ఏకాకి అయిపోయినట్లున్నది. ఇక అక్క తనకు యీ యింటితో యీ జన్మకు ఋణం తీరిపోయినట్లు అమ్మకి తను తనకమ్మ తోడై ఏడుస్తున్నారు. చిన్న కర్మకి అందుకోగల్గిన వాళ్ళు కొంతమందైతే ఆ మరునాడు మరి కొంతిమంది వచ్చారు. హేమ వాళ్ళాయన్ని వెంటబెట్టుకొని వచ్చింది. వస్తూనే 'తాతయ్యా! తాతయ్యా' అంటూ అమ్మమ్మని చుట్టేసుకుని ఏడ్చింది. తాతయ్యతోటి తనకున్న అనుబంధాలు, జ్ఞాపకాలు ఒక్కసారి ముప్పిరిగొని ఉంటాయ్. జ్ఞాపకం తెచ్చుకొని మరీ యేడ్చింది. ఎవరన్నా ఉన్నారేమోనన్న ధ్యాస కూడా లేకుండా భోరున యేడ్చింది. అమ్మ కూడా అదే అవతారమెత్తింది.

ఔను. అమ్మకి నాన్నతో సాహచర్యం యాభైయేళ్ళు పైబడినది. ఆయన తోటివే ఆమె భావనలు కానలు.

ఇన్నేళ్ళుగా యెన్నో స్మృతులు, అనుభవాలు. అనేకమంది బంధువులు. ఒక్కొక్కరితో ఒక్కొక్కరకమైన అనుభవం; అనుభూతి, ఎవరన్నా కొత్తగా వచ్చినప్పుడు యిన్నీ పైకి రావటం మళ్ళీ ఏడ్వటం.

రాము, మధుల పిల్లలు తన పిల్లలతో జట్టు కట్టేశారు. 'అన్నయ్యా' 'అక్కయ్యా' అంటూ వరసతో సంబోధించుకుంటున్నారు. అరుగు ప్రక్కన బొమ్మలాట పెట్టారు. చిన్నాదే రఘుగాడు చిన్న దానిని కొట్టాడు అది వాళ్ళ నాన్న మధుతో చెప్పింది. ళ్ళీ 'చెల్లాయ్' అంటూ జతకట్టి ఆడుకొంటున్నారు యీ రోజు.

పిల్లలు ప్రేమాభిమానాలు, మమతానురాగాలంటే యేమిటో తెలియనివాళ్ళు. ని వాటితో పెనవేసుకు పోయారు. అన్యోన్యతలు పెంచుకొంటున్నారు.

తండ్రులు ఏ కోదరులైన విడదీసిన దూరంతో, పరిస్థితులు కల్పించిన నీడల్లో దూరంగా దూరంగా ఉంటున్నారు. నాన్నతో యెప్పుడు రాజీపడలేని తాను, యిప్పుడు యే రోజుకా రోజు భార్యతో, పై బాస్ లతో, పరిస్థితులతో చేస్తున్నదేంటి?

తనకు భిన్నంగా తమ్ముళ్ళు జీవితాలున్నయ్యనుకోవటం లేదు.

ఇక తల్లులు. వీటన్నింటిని నిర్వచనాలతో సహా చదువుకున్న సుమిత్ర తోడికోడళ్ళు ఇంకా 'ఏమండీ 'ఏమండీ' అనుకొంటున్నారు. ఆప్యాయతల్ని దరికి రానీయటం లేను. ఒట్టి ఫ్రెండ్లీనెస్.

గంటసేపు క్రింద వచ్చిన హేమ అప్పుడే వరసలు కట్టి 'అక్కయ్య'లను క్షేమ సమాచారాలడుగుతుంది.

చిన్న మరదలు 'లేదండి. మాకు సెలవు దొరకటం కష్టమై పోయింది'

మామగారి అవసాన దశలో రాలేకపోయినందుకు కారణాలు చెప్తున్నది.

'అక్కయ్యా...ఏమండి.'

వీటి రెండిటికీ దూరమెంత ? ఈ దూరాన్ని దేనితో కొలవాలి ? దగ్గరౌటానికి అడ్డొచ్చేదేమిటి ?

చదువా—అది నేర్పిందనుకొన్న నాగరికతా ? సంస్కారమా ?

వలయాలు–ముసుగులు.

'నమస్కారం బావా !...వీరే మావారు.' హేమ భర్తని తీసుకొచ్చి పరిచయం చేసింది.

'నీవు పెళ్ళికి రాలేకపోయావు కాని చిన్నబావ లిద్దరూ వచ్చారు...ఆ! అం

వేస్తున్నానమ్మా! మీరు మాట్లాడుతూ ఉండండి. అమ్మ పిలుస్తోంది వెళ్తాను' వెళ్ళిపోయింది.

హేమ భర్త యెక్కడో చిన్న ఆఫీసర్ పదవి చేస్తున్నాడు.

కాని హేమలో నిండుదనం కన్పిస్తుంది.

అది జీవితంలో తృప్తి, ఆనందం లేక పోతే రాదు.

ఏదో పోగొట్టుకొన్న దానిలా లేదు.

తనను పోగొట్టుకొన్నానని బాధపడి ఉంటుందనుకున్నాడు

హేమలో ఆ ఛాయలు కూడా ఉన్నట్లు లేవు.

కల్గినదాంతో తృప్తి - ఉన్నదాంతో ఆనందం.

మరి తను. ఏమో?? తనదే అవస్థో తనకే తెలియదు. తన జీవితం ఆనందమయమో విచారసాగరమో తనకే తెలియదు.

'అన్నయ్యా?' రాముడు పిలిచాడు.

'ఏందుకురా ?' అన్నాడు.

ఆ పిలుపులోనూ, తన సమాధానంలోను ఏదో పరిపూర్ణత ధ్వనించింది. విఫినిటీ ఉన్నది. చనువున్నది.

'ఏమిటిరా రాము ?' మళ్ళీ అడిగాడు.

'అమ్మ గురించే...'

'అమ్మ గురించా? ఏమిటి ?'

'ఏముందన్నయ్యా ! అమ్మ ఒక్కతే ఏలాగూ ఇక్కడ ఉండలేదు. అసలే రోగ్యం కూడా అంతంత మాత్రమే ఏవరిదో ఒకళ్ళ సహాయం కావల్సిన వయస్సు ఇది. ఇక్కడ ఏవరూ ఉండరు కష్టపడాల్సి నంత కాలం పడింది. ఇంకా ఆమె కష్టాలు పడటం మన కెవరికీ సంతోషదాయకం కాదు; శుభప్రదమూ కాదు.'

'అలాగే చేద్దాం. ఏదో రమో ఒకళ్ళం తీసికెళ్దాం. కాని అమ్మ అభిప్రాయం కూడా కనుక్కోవాలి కాదా !'

'అందుకనే.'

ఆమె అభిప్రాయాన్ని కనుక్కోవటానికి తనను నియమించారు పెద్దరికం యిస్తూ.

ఆమె కొడుకుల సంభాషణ ఒక మూల కూర్చుని వింటూనే ఉన్నది.

'ఏమంటావమ్మా ?' అడిగాడు రావు.

'ఏమనేదేముంది పొలాలు కౌలు కిచ్చేసి యెక్కడో అక్కడ కృష్ణా రామా అను కుంటూ కాలక్షేపం చేసెయ్యటమే' మధు అభిప్రాయాన్ని వెల్లడించాడు.

ఆమెకీ సంభాషణం యింపుగా లేదు: బాధ కూడా కల్గింది. చెట్టంత తండ్రి పోయి మూడు రోజులు కాలేదు. ఆ దుఃఖ ఛాయలునుండి యింకా కోలుకోలేదు. అప్పుడే అమ్మని భాగాలు వేసుకొంటున్నారు కొడుకులు.

'నే నెక్కడికీ రాను.' ఖండితంగా అనేసి వెక్కి వెక్కి యేడ్వటం మొదలెట్టింది.

'ఆయనుండగానే పసుపు కుంకుమలతో పోతే నాకీ బాధలు ఉండేవి కావు.'

'అదేంటమ్మా! నీవు ఇక్కడుంటే కష్టాలు పడ్తావనే కదా మేం మా వెంట ఉండమని కోరేది.'

'అవును రా. నా బాధలు తీర్చటానికే మీరు రమ్మనేది. కాని యీ యింటిలో చూడండి. ప్రాణమున్న వాటిల్లోనే కాకుండా, ఆఖరికి నిర్జీవాలైన ప్రతివస్తువులోను ఆయన కనబడుతున్నారు. నిన్న గాక మొన్న ఏంతో ప్రాణప్రదంగా చూచు కొంటున్న యజమాని వీటన్నింటిని విడిచి వెళ్ళిపోయారు. ఆయన అడుగుల సవ్వడులు, ఆయన కంఠధ్వనులు యింకా రింగురుమంటూనే ఉన్నాయ్. వీటన్నింటిని విడిచి పెట్టలేను. ఈ జ్ఞాపకాల పరిధి నుండి రాలేను. నన్నయినా ఆయన ఆత్మ శాంతి కోసం దేవుణ్ణి ప్రార్థించుకో నివ్వండి.'

ఈ సంభాషణ ఏందుకెత్తావూ అని విచారించాడు రావు.

'అదేంటమ్మా అలా అంటావు? ఇన్ని నంతకాలం నాన్నకు సేవలు చేసి బాధలు పడ్డావ్. ఇక ముందైనా కొంచెం విశ్రాంతి దొరుకుతుందని అన్నాం కాని...' సమ ర్థించుకోబోయాడు మధు.

'నా బాధలు మీకు కావాలి బాబు; సంతోషమే. నేను కష్టాలు పడుతున్నా నంటే మీకు బాధ కల్గుతుంది. అదీ ఏ తల్లీ కోరుకోదు.'

'అందుకే కదమ్మా?' రావు అందు కొన్నాడు.

'కాని నన్ను ప్రేమించినదాంట్లో మీ నాన్నను వెయ్యోవంతు ప్రేమించార రా?... లేదు...ఆయన అవసరం లేదు మీకు. ఈనాడు ప్రయోజకులయ్యారు కాబట్టి ఆయన ఆస్తి కూడా అవసరం లేదు. కాని ఆయన తీర్చి దిద్దిన మీ బ్రతుకులు మాత్రం మీవి. ఆయన జ్ఞాపకాలు కూడా మీకొద్దు: అవన్నీ దయ్యాలు, భూతాలు'

'చాలా కటువుగా అంటున్నావమ్మా ?' రాము అన్నాడు.



'లేదు. చాలా మెత్తగా చెబుతున్నాను. మీరు అధికంగా ప్రేమించే అమ్మకి భర్తగా ఆయన్ని మీరు చూశారు. గౌరవించారు. భయపడ్డారు. ఆయననుకొన్నట్లు మిమ్మల్ని తీర్చిదిద్దుకోగలిగారు కాని మీ ప్రేమల్ని అభిమానాల్ని పొందలేకపోయ్యారు. మిమ్మల్ని వాలాగా మమతానురాగాలతో బంధించలేక పోయ్యారు. అదీ ఆయన చేసుకున్న పాపం.'

'అవన్నీ యిప్పుడెందుకమ్మా ?' ఆపు జెయ్యాలని అన్నాడు రావు.

'ఇంకెప్పుడురా. ఆయన ఆఖరి మాటగా

## కారు మేఘం

ఏమన్నారో తెలుసా. 'పెద్దాడు, పిల్లలూ వచ్చారా?' అన్నారు' దుఃఖాన్ని ఆపుకోలేక యేడ్వటం మొదలెట్టింది.

'అమ్మమ్మా 'ఊరుకోవే,' హేమ కళ్ల నిండా నీళ్లు నింపుకొని, మంచినీళ్లు పట్టుకొచ్చి ఓదార్చింది.

'అదుగో—బయటున్న ఆ మామిడిచెట్టు చూడండి. ఏడేళ్ల క్రిందట నాటారు, ఇప్పుడు కాయలు కాస్తుంది. దాని క్రింద కూర్చొని 'మనం — అూ చెట్టు నంటే వాళ్ళమే...మన పిల్లలు మాత్రం ఆ పళ్ళు అవి యెంత మధురంగా ఉంటాయో చూడని తరచూ అంటూ ఉండేవారు... దానికి తగ్గట్టుగానే మీ...మీరుకూడా మీ ప్రయోజకత్వం మీకు మీరే సంపాదించుకొన్నారనే భావంతోటే ఉన్నారు.'

ఎవరూ యేమీ మాట్లాడటం లేదు. నిశ్శబ్దం తాండవించింది.

'మనకున్న పది యెకరాల పొలంతో మిమ్మల్ని చదివించటానికి యెన్ని కష్టాలు పడ్డారో మీకు తెలియదు. ఆ కష్టాల్ని తెల్పుకోకుండా మీ రెక్కాడ బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తారోనని భయాన్ని మీలో రేకెత్తించారు. ఆఖరికి ... అదే... అదే... ఆయన్ని యెందుకూ పనికిరాని వాడిగా చేసింది. మీ అందరి దృష్టిలో పల్లెయ్య— నేమవరం వెళ్లొచ్చినట్లుగా ఆయన యీ లోకంలోకివచ్చి వెళ్లిపోయారు.'

'అదేమిటమ్మా! మేమంత కృతఘ్నత చూపించామా?' రావు ఉండబట్టలేక పోయాడు.

కృతజ్ఞత, కృతఘ్నతలు ఎవరికి వారు ఆత్మసాక్షిగా అనుకోవాల్సినవిరా. నేను మిమ్మల్ని గురించి అలా అనుకోను. మీ అందరికీ అమ్మ అంటే దేవతనే పూజ్య భావం ఉన్నది. గౌరవం ఉన్నది. నేను దీపం వంటి దాననని అన్నారు కూడ ఒకసారి. నిజమే...మీ అందరికి వెలుగు నిచ్చానేమో! ...కాని ఆ వెలుగుకు చమురు...చమురుని మర్చి పోయారురా మీరు...'

ఆమెని ఏడ్వకుండా ఆపటం ఎవరితరం కావటం లేదు.

'నాన్నంటే మీ అందరికీ సింహస్వప్నం. అది నాకూ తెల్సు. ఆయన ఉరుములు మెరుపులకి మీ జీవితాలు బీటలు వారి పోతయ్యనుకున్నారు. కాని ఆయన...ఆయన. మేఘం రా...కారు మేఘం.' భోరున ఏడ్వటం మొదలెట్టింది.

కొడుకులు ముగ్గురూ చలించారు. హృదయాలు ద్రవీభూతాలయ్యాయి. కళ్ళ నిండా నీళ్ళు క్రమ్ముకొన్నది. వాళ్ళకి తెలియకుండానే కన్నీటి బిందువులు నాన్న పాద ద్వయం తిరుగాడిన ప్రదేశంలో క్షమాభిక్ష అభ్యర్థిస్తున్నట్లు బొటబొటా రాలినవి. ●

# ఒక వారం విపరీతం

శాలాక్షుడు

## అబద్ధపు వార్త!

శత్రుఘన్‌సిన్హాకి తనకూ వివాహం జరగనే లేదని, ఆ వార్త శుద్ధ అబద్ధమని, ఆతనికి తనో రాఖీ పండుగనాడు రాఖీ కట్టి, తన అన్నగా భావించానని నటి హేమామాలిని అన్నదట. శత్రు తరుచుగా తమ యింటికి వస్తూ పోతూంటాడని, ఎక్కువగా, తమింట్లో ఫోం చేస్తాడని, అయితే అతను కాస్త అతిగా మాట్లాడుతాడనీ చెప్తూ, 'నేను మూడేళ్ళ క్రితం 'తూ హసీ మై జవాన్' సినిమాలో నటిస్తూ వుండగా అతను నా దగ్గరకు వచ్చి సినిమాలో వో చిన్నవేషం యిప్పించమని అడిగాడు' అని 'అతన్ని వివాహం చేసుకోడమా!' అని హేమమాలిని నవ్విందట.

## ఉండి కాలవలో గోనెలో యువతి శవం

13వ తేదీన భీమవరానికి అయిదు మైళ్ళదూరంలో వున్న ఉండి వద్ద కాల్వలో వో గోనెసంచి తేలుతూ వుండడం చూసిన పోలీసులు ఆ సంచిని ఒడ్డుకులాగి, తెరిచి చూస్తే అందులో 20 ఏళ్ళ యువతి శవం కనుపించిందట. ఆ యువతికి చేతులూ కాళ్ళూ కట్టేయబడి వున్నాయట. ఎడమరొమ్ములో కత్తి పోటు గుర్తులున్నాయట. పాపం ఆమె ఎవరో, ఎందుకు, ఎవరు, ఎప్పుడు యీ హత్య చేశారో అని పోలీసు గాలిస్తోంది.

## దొంగతనం తెచ్చిన ముప్పు

బొంబాయిలోని మురికిపేటల్లో నివసిస్తున్న వో ఎనిమిదేళ్ళ కుర్రాడు తన లాటి మరోహతని వద్ద నుంచి వో పదిపైసలు తస్కరించి యింటికి వెళ్ళేసరికి ఆ కుర్రాడి తండ్రి పదిపైస లెక్కడివని అడిగాడట. కొడుకు దొంగతనం చేసినట్టు విన గానే తండ్రికి కోపం వచ్చి, వో రబ్బరు పైపుతో అతని తల మీద కొట్టాడట. ఒకే దెబ్బతో ఆ కుర్రాడి ప్రాణాలు గాలిలో కలసిపోయాయట.

## భార్యని హత్యచేసిన భర్త

అర్కాటుకు చెందిన వో హరిజనవాడలో 28 ఏళ్ళ వేదముత్తు తన భార్య 18 ఏళ్ళ ఇంద్రాణి నీ ఆమె పుట్టింటికి వెళ్ళి డబ్బు పట్టుమ్మని ప్రతిరోజూ హింసిస్తూ వుండేవాడట. నిండ మూలాలు ఇంద్రాణి యీ బాధలు భరించలేక, అదే వూరిలో వున్న తన పుట్టింటికి వెళ్ళిపోయిం దట. దాంతో వేదముత్తుకు కోపం వచ్చి, ఆమె పుట్టింటికి వెళ్ళి, పోట్లాడి ఇంద్రాణిని తన యింటికి తీసుకువచ్చి, వస్తూనే ఆమెను ఇనుప కమ్మీతో గొడ్డును బాదినట్టు బాదాడట.. ఆ దెబ్బలకు తట్టుకోలేక, ఇంద్రాణి చనిపోయిందట.. పోలీసులు వచ్చేలోగా ఆతను పారిపోతే వాళ్ళు తెగవెతికి, చివరికి రత్నగిరి పర్వతం ప్రాంతంలో దాక్కున్న వేదముత్తును పట్టేశారట. డిటెక్టివ్ డైర్యాల్టీ! అయితే మాత్రం పట్టుకున్నందుకు మెచ్చుకోవద్దూ!

## చిన్నపిల్లలలో త్రాగుడు అలవాటు!

అమెరికాలో త్రాగుడు చిన్నపిల్లలను వాటేసు కున్నదట. తొమ్మిది నుంచి 12 వయస్సులోపు వారు మితిమీరి త్రాగుతున్నారని, సుమరు నాలుగున్నర లక్షల మంది చిన్నపిల్లలు మద్యం సేవిస్తున్నారని, జాతీయ ఆల్కహాలు పరిశోధనశాఖ, డైరెక్టరు మొర పెట్టారట. మద్యం సీసాలు మీదెట్టి తాగద్దురా చిట్టినాన్నా అంటే ఎవడూ లొంగడు చెప్పండ్సార్! త్రాగుడులో మితిమీరి అంటే ఆ త్రాగుడులో మితానికి వో రేఖ కూడా వున్నట్టు లెక్క! ఏవిటో దిస్ బ్రాందీ యుత!

## హరిజనులకు మైసూరుమంత్రి హితబోధ!

మైసూరు రాష్ట్రమంత్రి గౌరవనీయులు శ్రీ బసవలింగప్పగారు ఆమధ్యన బీజపూరులో వో బహిరంగసభలో మాట్లాడుతూ బ్రాహ్మణ స్త్రీలను గురించి చాలా అసభ్యంగా అన్నారట. "బ్రాహ్మణ స్త్రీలను గాని, బాలికలను గానీ కను పించిన వారిని కనుపించినట్టే చెరచకుండా వదలి పెట్టవద్దు"ని ఆయన హరిజనులకు బోధించినట్టు ఢిల్లీ "ఆర్గనైజర్" వారపత్రిక రాసిందట. బీజపూరులో జరిగిన సంఘటనను పేర్కొంటూ దేశ్‌పాండే అనే ఆయన, మరికొందరు బ్రాహ్మణ యువకులు ముఖ్యమంత్రికి వో మెమొరాండం సమర్పించారట. ఆయనేం చేశారు! ఏం చేస్తారు! అందుకు నంటారా మెమొరాండాన్ని.

## ఖడ్గమృగంతో కుస్తీ!

వో వుత్సాహవంతుడైన యువకుడు గోహతి లోని వో జంతుప్రదర్శనశాలకు వెళ్ళి, తన్నవరూ చూట్టం లేదని నిర్ధారణ చేసుకుని, కోర్కె తీరా రుూమ్మని ఎగిరి, ఖడ్గమృగం వున్న ఆవరణలోకి దూకి దానితో కుస్తీ పట్టాలనే తన చిరకాల వాంఛతీరా దాన్ని చకచక గుద్ద నారంభించాడట. ఇదేమిటా వింతని కాస్సేపాశ్చర్యపోయిన ఆ ఖడ్గమృగం, కాస్సేపటికి చిర్రెత్తి, తల ఆడించిందట. ఆ దెబ్బతో ఆతడు ఎగిరి నేలను కరుచుకుని, స్పృహ పోగొట్టు కున్నాడట. ఈలోగా వాన రాడంవల్ల ఆకుర్రాడిని వదిలేసి, ఖడ్గమృగం వెళ్ళిపోయిందట—భూమిమీద నూకలుండట మంటె యిదే గావాల్సు!

## సుమిత్రాదేశాయ్ జాడ?

మే నెలలో మాయమయిన సుమిత్రా దేశాయ్ జాడ యింతవరకూ తెలియకపోడం చాలా విచార కరమైన విషయమని, యీ విషయంలో ప్రధాని జోక్యం కలుగజేసుకుని, ప్రజలలో శాంతిభద్రతలలో కలుగుతున్న అపనమ్మకాన్ని ఆప ప్రయత్నించాలని స్వతంత్రపార్టీ ప్రధానకార్యదర్శి మధుమెహతా అన్నారట. ఆవిడ యత్నాలు ఫలించని పరిస్థితిలో తానే యీ విషయంలో జోక్యం కలుగజేసుకుంటా నిన్న కూడా ఆయనన్నారట. సుమిత్రాదేశాయి కోసం మైసూరు, గోవా, మహారాష్ట్ర, కేరళ, తమిళనాడు, ఆంధ్ర పోలీసులు గాలిస్తున్నారట— స్తున్నారా! ●



# పుస్తకాలు

**అర్ధశతాబ్ది కాలంలో ఆంధ్రులపైని అక్టోబరు విప్లవప్రభావం**

రచన కంభంపాటి సత్యనారాయణ. వెల : రూపాయిన్నర. వికాససాహితి, 14 న్యూపెన్షనర్స్ ఫస్ట్‌లేన్, మద్రాసు—21.

1917 నవంబరు (అక్టోబరు ఆనాడు రష్యాలో అమలులో వున్న కేలండరు ప్రకారం) 7వ తేదీన రష్యాలో జరిగిన విప్లవం జార్ ప్రభువుల అధికారాన్ని కూలదోయడమేనా చేసింది? మానవ సమాజ ప్రగతిని మరో మెట్టు ఎక్కించింది.

ఉత్పత్తి సాధనాలన్నింటినీ సమాజ పరంచేయడం. సమాజంలో అధికారం కార్మికవర్గం నాయకత్వాన కష్టజీవి వర్గాలకు స్వాధీనపరచడం. దోపిడి చేసి బ్రతికే వర్గాలను తొలగించడం మానవ ప్రగతిలో సాధించిన పదార్థిక, ఆత్మిక సంపదలను సర్వ ప్రజలూ సమాన ప్రతిపత్తితో అనుభవించడం— నవంబరు (అక్టోబరు) విప్లవం తెచ్చిన అభివృద్ధి ఫలితం

ఇల్లాంటి పర్యవసానం అందరికీ నచ్చదు. ఆనాడు మనదేశాన్ని గుప్పిట్లో పట్టుకొని వున్న బ్రిటిష్ ప్రభుత్వంతో సహా సామ్రాజ్యవాద దేశాలు ఈ నూతన పరిణామాన్ని మొదటికే తుంచెయ్యాలని చూసేయి విఫలమయాయి. అదంతా వేరే కథ

భారతదేశ ప్రజలకి అక్టోబరు విప్లవం వంటిది ఒకటి వచ్చిందని, అటువంటిది సాధించడం అవసరమూ, సాధ్యమేనని తెలియకుండా చేసేందుకు బ్రిటిష్ అధికారులు ఎన్నో అడ్డదార్లు తొక్కేరు. అగచాట్లు పడ్డారు. కాని అదీ ఫలించలేదు.

జాతీయోద్యమ నాయకులు, రచయితలు, మేధావులు, పత్రికలు ఆ విప్లవం వేపు ఆకర్షితులయ్యేరు. దానిని గురించి వ్రాసేరు పాడేరు. ప్రచారం చేసేరు. దానిని గురించిన జ్ఞానం ఆ పై మెట్టులోనే ఆగలేదు ప్రజాసామాన్యంలోకి పాకింది ఈ నాటికి ఇష్టం వున్నవారూ, లేనివారూ ఆ వ్యవస్థ నిర్మించాలనేవారూ దానికి గోతులు తవ్వేవారూ కూడ ఆ అక్టోబరు విప్లవ లక్ష్యం అయిన సోషలిజం తమకూ లక్ష్యమేనని చెప్పుకొనే పరిస్థితి వచ్చింది

వటవృక్షంలా వ్యాపించి విస్తరించిన ఈ ఉద్యమం యొక్క అల్ప ప్రారంభం, ఆంధ్రదేశంలో ఏభయ్యేళ్ల క్రితం ఎల్లా వుందో తెలుపుతున్న పరిశోధన గ్రంథం ఈ 'అక్టోబరు విప్లవ ప్రభావం' అన్నది

దీనిలో వున్న ఎనిమిది వ్యాసాలలో చివరిది మహామనీషి లెనిన్. అక్టోబరు విప్లవాన్ని నడిపిన మహనీయుడు ఆయన సమాజం యొక్క భవిష్యత్తునే మార్చివేసిన ఆ విప్లవ అధినేత ఎటువంటివాడో తెలిపే చక్కని వ్యాసం

మిగిలిన ఏడూ వివిధ పత్రికలలో గతంలో వచ్చినవే జాతీయ కాంగ్రెసు నాయకులు శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు, కాంగ్రెసువాదీ చరిత్రకారులూ అయిన శ్రీ దిగవల్లి శివరావుగారు ఆనాడు ఆ విప్లవం గురించి ఎటువంటి అభిప్రాయాలు తెలిపేరో రెండు వ్యాసాలు వివరిస్తున్నాయి కాంగ్రెసువాది అయిన శ్రీ గోవిందరాజుల వెంకటకృష్ణారావుగారు లెనిన్ జీవితం గురించి వ్రాసిన పుస్తకాన్ని పరిచయం చేస్తుందో వ్యాసం శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి నవలలో వారు చర్చించిన వివిధ రాజకీయ భావాలను సోషలిస్టు భావాలతో సహా— సమీక్షిస్తుందో వ్యాసం జాతీయవాద పత్రిక అక్టోబరు విప్లవం— రష్యాలో దాని ఫలితాలూ గురించి అప్పుడప్పుడు ప్రకటించిన వివిధ వ్యాసాల పరిచయం వేరొక వ్యాసంలో తెలుగు దేశంలో 1930 తర్వాత సోషలిస్టు సాహిత్యం విస్తరించిన తెరగు చూపేది ఒకటి, సోవియట్ యూనియన్ తెలుగు భాషలో ప్రచురిస్తున్న పత్రికల, పుస్తకాల సమాచారం చూపుతున్నదొకటి

ఈ వ్యాస విషయమే చెప్తుంది, వానిని సేకరించడానికి రచయిత ఎంతో శ్రమపడి వుండాలని. పరిశోధకులూ, పరిశోధక సాహిత్యం చాల అవసరంగా వున్న తెలుగుజాతి ప్రస్తుత పరిణామ దశలో శ్రీ కంభంపాటి వారి కృషి ఎంతేనా సమాదరణీయం.

— అవంతి. ●





**అవీ...ఇవీ**

శ్రీకృష్ణ బాలానంద సంఘ (మద్రాసు) సప్తమ వార్షికోత్సవము 2—7—73న నల్లతంబి సేతురామన్ కల్యాణ మండపములో శ్రీ ఎస్. వెట్రివేల్, అసిస్టెంట్ కమీషనర్ ఆఫ్ పోలీసు (హెడ్‌క్వార్టర్స్) అధ్యక్షతన జరిగింది. శ్రీమతి లీలా వెట్రివేల్ బహుమతులని పంచి పెట్టారు.

—(ఒ వి.) ●

## నిధులకోసం వేట

(49వ పేజీ తరువాయి)

ఆ వంద ఏళ్లలోనూ ఏక్కువ ప్రయోజనం లేకపోయింది

1903 లో కెప్టెన్ విలియమ్ బర్న్స్ ఒక ఆధునిక పరికరాన్ని తీసుకుని సముద్రంలోకి చొచ్చుకుపోయాడు మట్టిని దొళగించి కొన్ని కత్తులు, కొవ్వొత్తి సెమ్మెలు బయటికి తీశాడు. అవి పెద్ద విలువయినవేవీ కాదు.

మొదటి ప్రపంచ సంగ్రామానికి ముందు కలనెల్ కెన్నెత్ ఫాస్ అనే అతనికి ఒక మెడల్ దొరికింది. దానిమీద 'ప్రపంచానికి నేను కాంతి, మార్గాన్ని, విజ్ఞానాన్ని, జీవితాన్ని' అని రాసి వుంది. ఈ పతకం రాళ్లమధ్య పడివున్న ఒక అస్థి పంజరానికి వున్నదట...!

ఈ మధ్య జరిగిన ప్రయత్నాల్లో పెద్ద ప్రయోజనమేమీ లేదు. 1950లో గ్రిల్ డ్యాక్ బ్రిటిష్ నేవీ సాయంతో ఈ ఓడ పగిలిన స్థలాన్ని ఖచ్చితంగా కనిపెట్టాడు.

1954 లో కమాండర్ గ్రబ్ సముద్రంలోకి దూకాడు. రెండేళ్ల తర్వాత అతను ఏమైపోయాడో చివరికి తెలీయదు.

ఈ వేటలో టి. వి. కెమెరాలు, కొత్త కొత్త పరికరాలనికూడా ఉపయోగిస్తున్నారు,

ఈ నిధి సముద్ర గర్భంలో అంతకంతకి లోతుకి వెళ్లిపోతున్నదని వెంటనే తవ్వి బయటికి తియ్యకపోతే ఆ తర్వాత చివరి తరమూ కాదని కొందరు పరిశోధకులు అంటున్నారు.

చివరి అదృష్టం చిలా వుందో వేచి చూడాలి!

(ఇంకా వుంది)


Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1, and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.
Editor : S. Radhakrishna.



"కచ్చే ధాగే" లో మౌసమీ ఛటర్జీ

